గోపీచంద్
కథలు

# దేశం ఏమయ్యేట్టు?

నవసాహితి
ప్రచురణ

# ఇందు


స్పర్థ

దేశం ఏమయ్యేట్టు

కార్యశూరుడు

ఆకారాలు

పిరికివాడు

ధర్మవడ్డీ

భయం

ఇలా జరిగేను!

బీదవాళ్ళంతా ఒకటి

గోడమీద మూడోవాడు

# స్పర్థ



వీరయ్య కొడుకు కోటయ్య. వీళ్ళిద్దరికీ స్పర్థ రావటం ఊళ్లో అందరికీ ఆశ్చర్యంగానే వుంది. చాలా కాలం వరకూ తండ్రీకొడుకులు చాలా అన్యోన్యంగా వుండేవారు. అన్యోన్యము అంటే, తండ్రి చెప్పినట్టు కొడుకు వినేవాడు. ఇప్పుడా పరిస్థితి మారింది — ఈ మధ్య వీరయ్య భార్య చనిపోవటం, అతడు మళ్ళీ పెళ్ళి చేసుకోవటం జరిగింది. అంతకు ముందే కోటయ్య పెళ్ళి అయింది. అప్పటినుంచీ తండ్రీకొడుకుల మధ్య స్పర్థ పెరిగింది. ఉన్న పూరిగుడిసె చెరిసగం చేసుకొన్నారు. చెరొక ఏభై రూపాయిలూ పంచుకున్నారు. తన ఏభై రూపాయిలూ పెట్టి వీరయ్య వెంటనే ఒక గేదెను కొన్నాడు. అతని భార్య పాలూ, పెరుగూ అమ్మటం మొదలు పెట్టింది. అది చూచి సహించలేక, కోటయ్యభార్య పోరిపోరి భర్తతో తమ కొక గేదెను కొనిపించింది. అప్పటినుంచి మరీ స్పర్థ ఎక్కువైంది. మేత వెయ్యటం మొదలుకొని, పాలు అమ్ముకొనటంవరకూ రోజూ తగాదాలు జరుగుతూనే ఉన్నాయి.

ఆనాడు అయిదు గంటలకు లేచి గేదెకు మేత వెయ్యటానికి దొడ్లోకి వెళ్ళాడు కోటయ్య. తమ గేదెకంటె మామగారి గేదె ఎక్కువ పాలిస్తూ వుందనీ, తమ గేదెకు పోషణ సరిగ్గా జరగటంలేదనీ, భార్య పోరితే కోటయ్య అప్పటినుంచి గేదెకు తనే మేత వెయ్యటం, కుడితి పెట్టటం

చేస్తున్నాడు. గేదెకు జనపకట్ట వేద్దామని వామి దగ్గరకు వెళ్ళాడు. దాని ప్రక్కనే తన తండ్రి వామి వుంది. తండ్రి వామిని చూచేటప్పటికి అతనికొక దురాలోచన కలిగింది. తనతండ్రి మంచి జనపకట్టలు పోగుజేశాడు, తన గేదెకు ఆ జనపకట్ట వేస్తే—యీ ఆలోచన తట్టీ తట్టటంతోనే అతి భయంకరంగా కనిపించింది కోటయ్యకి. నెమ్మదిగా అలవాటైనది. తన తండ్రి వామిదగ్గరకు వెళ్ళాడు. ఒక జనపకట్ట లాగాడు. రెండడుగులు వేశాడు. ఎదురుగా తండ్రి కనిపించాడు. ఎందుకనో ఆ జనపకట్టతో తండ్రిని బాదుదామనిపించింది. జనపకట్ట చేత్తో పట్టుకొని రోషంగా చూశాడు. వీరయ్య ఏమనుకున్నాడో! అక్కడనుంచి నెమ్మదిగా వెళ్ళిపోయాడు. గబగబా జనపకట్ట గేదెముందు దులిపి గుడిసెలోకి వచ్చి పడుకున్నాడు కోటయ్య.

తెల్లవారేటప్పటికి ఈ సంగతి ఎట్లా తెలిసిందో వీరయ్య భార్యకు తెలిసింది. వీరయ్య యింట్లో లేడు. వీరయ్య భార్య ఈ సంగతి తెలిసీ తెలియటంతోనే దొడ్లోకి వెళ్ళి కోటయ్య వామిలోనుంచి నాలుగుకట్టలు లాగి తన గేదెకు వేసుకుంది. ఈ సంగతి కోటయ్య భార్యకు తెలిసి తగాదా పెట్టుకుంది.

"నీ చెయ్యి విరగా—"

"నీ మొగుడెందుకు చేశాడే!?"

"నా మొగుడు చేశాడా!?"

"మా జనపకట్ట లాగి—"

# స్పర్థ

"రుజువు చెయ్యి ?"

వీరయ్య భార్య ప్రక్క గుడిసెలో కాపురం వుంటున్న రత్తయ్యని పిలిచి రుజువుచేసింది. అంతా చెప్పి, "రత్తయ్య మామకూడా చూశాడు" అని చెప్పింది. అక్కడితో మరీ రేగింది కోటయ్య భార్య. మమ్మల్ని ఇంట్లో వుండకుండా చెయ్యడానికని ఈ పన్నాగం పన్నావన్నది. వాడకట్టువాళ్ళందర్నీ కూడగట్టుకుంటున్నావన్నది. అంతా నీ పక్షం పలక్క, దిక్కులేని పక్షిని నా పక్షం ఎవ్వరు పలుకుతారన్నది. నా కేమి _ అండా దండా అన్నది. అక్కడితో వీరయ్యభార్య వేసుకుంది. మళ్ళీ జుట్టూజుట్టూ వేసుకొన్నారు. వాడకట్టంతా పోగైంది. ఎవ్వరికి చెప్పేవి వారికి చెప్పి అప్పటికి సద్దారు.

కోటయ్య భార్యకు కోపం ఆగలేదు. ఇంట్లోకివచ్చి మొగుడిమీదకు రేగింది. 'దీనికంతకూ నీ మెత్తదనమే కారణం' అని బిగ్గరగా ఏడ్చింది. దొంగతనాలు కట్టినా రంకుతనాలు కట్టినా నీకు పట్టపట్టు కూర్చుంటావు. ఒక్క ఆడదాన్ని నా వల్ల ఏమవుతుంది? అని ఏడ్చింది. కాని కోటయ్య 'కిం' అనలేదు. 'కమ్' అనలేదు. తలనిండా ముసుగు పెట్టుకొని పడుకున్నాడు పడుకున్నట్టే వున్నాడు.

వీరయ్య ఎక్కడెక్కడ తిరిగాడో సాయంకాలం ఇంటికి వొచ్చాడు. వొచ్చీ రావటంతోనే సంగతంతా పసికట్టాడు. కోటయ్యభార్య అతనికి వినబడేటట్లు తిట్లు ప్రారం

భించింది. ఆ తిట్లు విని వీరయ్య భార్య జయ్యిన లేచింది తొక్కతొక్కిన పామల్లే. ఇద్దరూ మళ్ళీ లడాయి వేసుకున్నారు. పాతపాటే అయినా మళ్ళీ వాడకట్టంతా చుట్టుముట్టింది. వీరయ్యకు కోపం వచ్చింది. "నోరుమూసుకు లోపలకు వెళ్ళు." అని గదమాయించాడు భార్యని.

"దొంగతనం చేస్తుంటే !" అని అరచింది.

"ఎవరు దొంగతనం చేసింది ?"

"నీ కొడుకు"

"ఎవరు చెప్పారు ?"

"నువ్వు చెప్పకపోతే దాగుతుందనుకున్నావా ?" అన్నది భార్య.

"ఎవరు చెప్పారు?"

"రత్తయ్య"

"వాడిమాట ఎందుకు నమ్మావ్ ?"

"ఒకరు చెప్పేదేమిటి ఇంతంత ఆకు వాళ్ళకాడ ఎక్కడిదీ ?" అని కోటయ్య గేదె ముందున్న జనపకాడ చూపించింది.

"వెళుతూ నేనే మన జనపకట్ట ఒకటి వేసి వెళ్ళాను. దీనికింత గోలేమిటి" అన్నాడు వీరయ్య.

"చూచారా, చూచారా .... ఎంత పన్నాగం పన్నిందో... ఈ గుడిసెలో, మేముండటం ఇష్టంలేక ఇదొకటి వేయించింది—" అని అక్కడ పోగయిన వారందరికీ

# స్పర్థ

యథార్థాన్ని తెలియజెప్పింది కోటయ్య భార్య .... చెప్పి మొగుడుదగ్గరకు పరుగెత్తింది.

"చూశారా!" అన్నది. ముసుగు పెట్టుకొని పడుకున్న కోటయ్య మాటాడలేదు.

"మీనాన్న వొచ్చాడు, వున్నదివున్నట్టు చెప్పాడు" అన్నది.

"ఏం చెప్పాడు?" అంటూ మంచంమీదనుంచి ఉలికిపడి లేచాడు కోటయ్య.

"మన గేదెకు తన జనపకట్ట తనే వేసి వెళ్ళాడట" అన్నది భార్య.

ఈ మాట వినగానే కోటయ్య మళ్ళీ గబుక్కున ముసుగు పెట్టుకొని పడుకున్నాడు. భార్య చిలవలు, పలవలు చేసి చెబుతూనేవుంది. అత్తను తిడుతూనే వుంది. అతను మాత్రం వేసిన ముసుగు తియ్యలేదు.

-oo:o:oo-

# దేశం ఏమయ్యేట్టు ?

"విన్నావటోయ్!" అన్నాడు వెంకట్రావు గబగబా పరుగెత్తుకుంటూ వచ్చి.

రామారావు అప్పుడే జపాన్ మిత్రమండలిమీద యుద్ధం ప్రకటించిందనీ, మిత్రమండలికి చాలా నష్టం కలిగిందనీ విన్నాడు. వెంకట్రావు ఆ సంగతే చెబుతున్నాడనుకొని - "జపాన్ సంగతేనా!" అన్నాడు.

"జపాన్ సంగతి ఇప్పుడెవ్వరికి కావలసి వొచ్చిందోయ్? మన ఆచార్యుల సంగతి—"

"ఏం ఏమయింది ?"

"మన ఆచార్యుల్నీ, మరి కొందర్నీ పోలీసులు అరెస్టు చేశారు."

"ఎందుకు-సత్యాగ్రహమేనా?"

"సత్యాగ్రహంకాదు, పాడూకాదు," అన్నాడు వెంకట్రావు. "వాళ్ళంతా రోడ్డుకి అడ్డంగా నిలబడి, ట్రాఫిక్ ఆపి పోట్లాడుకుంటూవుంటే, పోలీసులు సర్దలేక బలవంతంగా లాక్కుపోయి జైల్లో వేశారట"

రామారావుకి ఆశ్చర్యం వేసింది. ఆచార్యులు గొప్ప రాజకీయవేత్తా, గాంధీ శంఖారావం చెవుల్లో పడ్డప్పటినుంచీ జైలుకి వెళ్తూవస్తూవున్న త్యాగధనుడూ ఎందుకు రోడ్డుమీద పోట్లాడుకొని జైలుకి వెళ్ళవలసి వచ్చిందో అతనికి అర్థంకాలేదు. అందులో ఈ సమయం

లోనా ? పరదేశాన్నుంచి మనల్ని రక్షించవలసిన బాధ్యత రాజకీయవేత్తల భుజస్కంధాలమీద (మెదడుమీద అయితే బాగుండేది) ఉంది. దేశమంతా ఏకమై, ప్రజలంతా ఒక్కటిగా లేచి, శక్తిని ఏకోన్ముఖం చేస్తేగాని మనకు దారిలేదు. లేకపోతే ఒకముళ్ళ తొడుక్కి బదులు మరోముళ్ళ తొడుగు తగులుకునే అవకాశం కనిపిస్తూ వుంది.

"దెబ్బలాటేం ఖర్మం ! మిగిలిన వాళ్ళెవ్వరు ?" అన్నాడు.

"ఏమో, నాకింకా పర్టిక్యులర్స్ తెలియవు" అని చెప్పి వెళ్ళిపోయాడు వెంకట్రావు.

రామారావుకి ఏమీ తోచలేదు. ఆలోచించాడు-పిచ్చిపిచ్చిగా వుంది-లేచి అటూ ఇటూ తిరిగాడు__జైలుకి వెళ్ళి సంగతి సందర్భాలు తెలుసుకోవాలని బయల్దేరాడు.

ఊరికి మైలుదూరంలో వుంది జైలు. అది ప్రభుత్వానికి జైలు__దొంగలకు ఖైదు __ సత్యాగ్రహులకు శ్రీకృష్ణజన్మస్థానం. ఊరికి దూరంగా, జనసమ్మర్దం లేకుండా, నిశ్శబ్దంగా వుంటేగాని ఖైదీలకూ, శ్రీకృష్ణజన్మస్థానవాసులకూ, హృదయపరివర్తనం కలగదని ప్రభుత్వం ఉద్దేశం. కాని క్రియలోమాత్రం హృదయ పరివర్తనం కలగటానికి బదులు మెదడు తిరగబడుతూ వుంటుంది.

రామారావు అధికార్ల దగ్గర పర్మిషన్ తీసుకొని జైలు ప్రవేశించాడు. అనేక గదులు దాటి, అనేక రకాల మనుషుల్ని దాటి, నెం. 24 సెల్ దగ్గరకు జేరాడు. ఆ సెల్లులో ఆచార్యులూ, ఒక కాంగ్రెస్ సోషలిస్టూ, ఒక కిసాన్ సభైటూ, ఒక కమ్యూనిస్టూ, ఒక రాయిస్టూ వున్నారు. ఆచార్యులు ఒకమూల కూర్చొని తకిలీ వొడుకు తున్నాడు. కాంగ్రెస్‌సోషలిస్టు తల కాళ్ళసందున ఇరికించు కొని కూర్చొన్నాడు. కిసాన్ సభైట్ చువ్వల్లోనుంచి దిక్కులు చూస్తూ నుంచున్నాడు. కమ్యూనిస్టు ఆవే శంతో అటూ ఇటూ తిరుగుతున్నాడు. రాయిస్టు ఎవరికీ సంబంధం లేకుండా ఒకమూల కూర్చొని పుస్తకం చదువు కుంటున్నాడు.

అటూ ఇటూ తిరుగుతున్న కమ్యూనిస్టు గబగబా ఆచార్యుల మీదకు మీదకు వెళ్ళి—"తకిలీ వొడికి దేశం తాడు పుటిక్కిన తెంపావ్! ఇకనన్నా మానుకుంటావా లేదా ?" అన్నాడు.

కాంగ్రెసుసోషలిస్టు కాళ్ళసందునుంచి తల పైకెత్తి విచారంగా చూశాడు.

కిసాన్‌సభైట్, "ప్రజలు మెచ్చుకుంటారని బైటచేస్తే చేశావ్ ! జైల్లోకూడా ఎందుకయ్యా !" అన్నాడు.

రాయిస్టు, "తాత్విక విప్లవం రావాలి. మాటలవల్ల ప్రయోజనం లేదు." అన్నాడు.

ఆచార్యులవారుమాత్రం వీళ్ళమాటలు లెక్క చెయ్యకుండా తకిలీ వొడుకుతూనే వున్నాడు. రామారావు నెమ్మదిగా ఆచార్యుల దగ్గరకు వెళ్ళి, "ఆచార్యులూ ?" అని పిలిచాడు.

ఆచార్యులు రామారావుగారు గొంతు విని ఉలిక్కి పడ్డాడు. తకిలీ ఆపేశాడు. "ఏమిటిదంతా?" అని అడిగాడు రామారావు.

"అంతా నడమంత్రమోయ్! మనం ఇన్ని సంవత్సరాలనుంచీ దేశంకోసం ప్రాణాలనుకూడా లెక్కచెయ్యకుండా పోట్లాడుతున్నామా? ఇప్పుడు వీళ్లు—ఈ కుర్రకుంకలు—నా కళ్ళముందు పుట్టిన వీళ్ళు—నన్ను తకిలీ మానివెయ్యమంటారా? మానకపోతే నన్ను ఫేసిస్టు అంటారా?" అన్నాడు.

ఈ మాటలు విని మిగిలినవాళ్ళంతా రంయిన ఆచార్యులు చుట్టూ పోగయ్యారు.

"మానకపోతే నువ్వు ఫేసిస్టువ్" అన్నాడు కమ్యూనిస్టు.

"మామాట వినకపోతే నువ్వు ఫేసిస్టువ్" అన్నాడు కాంగ్రెసుసోషలిస్టు.

"నువ్వు పెద్ద పెత్తందారువి. పెత్తనం మా రైతుకూలీ ప్రతినిధులకు వొదిలేవరకూ నువ్వు ఫేసిస్టువ్" అన్నాడు కిసాన్ సభైట్.

"తకిలీ మానినా మానకపోయినా వర్గ సంబంధా

లనుబట్టి నువ్వు ఫేసిస్టువ్" అన్నాడు రాయిస్టు—"నీభగవద్గీతా, నీ వేదాలూ, నీ ఆధ్యాత్మిక నాగరికతా అంతా ఫేసిస్టుమయమ్!"

"అవును," అన్నాడు కాంగ్రెస్ సోషలిస్టు.

రామారావుకి అంతా అయోమయం అయింది—"మీ రెవరండీ?" అని అడిగాడు.

"నేను కాంగ్రెస్‌సోషలిస్టుని" అన్నారు. అతను.

మిగిలిన నలుగురూ పక్కన నవ్వారు. ఆచార్యులు పెద్దమనిషితరహా కాదనుకొని నవ్వు ఆపుకోటానికి ప్రయత్నించాడు. కిసాన్ సభైట్ కోరచూపులుచూస్తూ నవ్వాడు. కమ్యూనిస్టు గంతులువేస్తూ నవ్వాడు. రాయిస్టు సంతోషం పట్టలేక ఒక కాగితం తిరగవేశాడు.

కాంగ్రెస్ సోషలిస్టుకి ఉక్రోషం వచ్చింది. బుంగమూతి పెట్టుకొని, "మీ రెప్పుడూ ఇంతే! నేనంటేచాలు, మీరంతా ఏకమవుతారు" అన్నాడు.

"ఏదోపిల్లలు పార్టీలో వుంటామంటే ఉండనిచ్చాం" అన్నాడు ఆచార్యులు రామారావుతో.

"సగం సాలినేతా సగం మాలనేతా?" అన్నాడు కిసాన్ సభైట్.

"రిఫార్మిజం, రిఫార్మిజం" అని కేకలు వేశాడు కమ్యూనిస్టు.

కాంగ్రెస్సో! సోషలిజమో! కాంగ్రెస్‌సోషలిజం ఏమిటి? ఉన్న అవక తవక అంతా పేర్లోనే వుంది. ఈ పేరు

పెట్టటంలో ఎన్ని పొరపాట్లో లెక్క వేసుకోండి చెబుతాను-

1. తంత్ర రీత్యా పొరపాటు.
2. రాజకీయ రీత్యా పొరపాటు.
3. సిద్ధాంతరీత్యా పొరపాటు.

"మేం మొదటినుంచీ ఈపార్టీ తీవ్రవాదుల్ని మోసం చేస్తుందని చెప్పాం. మీరు విన్నారా?" అన్నాడు రాయిస్టు.

"మేం చెప్పాం, మీరెప్పుడూ చెప్పలేదు" అన్నాడు కమ్యూనిస్టు.

"మీరు మమ్మల్ని ప్రోత్సాహపరచి, మాతోకలిసి పనిచేసి ఇప్పుడిలా అంటున్నారా?" అని జాలిగా ప్రశ్నించాడు కాంగ్రెసుసోషలిస్టు.

"అధికారం స్వాధీనం చేసుకోటానికి అలా నటించాము" అన్నాడు కమ్యూనిస్టు.

"నిజం చెప్పాలంటే మొదటినుంచీ మేం చెబుతున్నాం. ఈ దేశంలో కూలీ రాజ్యం కుదరదనీ, రైతు కూలీ రాజ్యం కావాలనీ మేం మొదటినుంచీ మొత్తుకుంటూ వుంటే మీరు మా మాట విన్నారా?" అన్నాడు కిసాన్ సభైట్.

"మీ రెవరండీ?" అని అడిగాడు రామారావు.

"మేం కిసాన్ సభ వాళ్ళం."

"పెటీబూర్జువాలు సోషలిజం వొప్పుకోండయ్యా అంటే వినరు" అన్నాడు కమ్యూనిస్టు.

"నిన్నటిదాకా మాలో పనిచేసి—" అని ఏదో అనబోయాడు కిసాన్ సభైట్.

"అధికారంకోసం... అధికారంకోసం" అన్నాడు కమ్యూనిస్టు.

"నిజం మా పార్టీ ఒకటుంటే వీళ్ళకి మరొక పార్టీ ఎందుకు చెప్పండి కాంగ్రెస్‌లో?" అన్నాడు కాంగ్రెస్ సోషలిస్టు.

రాయిస్టు అందుకున్నాడు—"కాంగ్రెసు ఉండగా కిసాన్‌పార్టీ పెట్టడంఎన్నితప్పులో చెబుతాను లెక్కపెట్టుకోండి

1 పిస్టపేషణం.

2 పోటీసంస్థ అవటం.

3 స్వతంత్ర్య సంఘ సంద్రోహం అవటం.

కాంగ్రెసు ఉండగా మళ్ళీ కిసాన్ ఎందుకూ? కాంగ్రెస్ ప్రజాస్వామిక విప్లవానికి సిద్ధంగా వుంది. రైతూ ప్రజాస్వామిక విప్లవమే చేస్తాడు.

"అయితే కాంగ్రెస్ విప్లవసంస్థఅని ఒప్పుకుంటారా?" అని ఆదుర్దాగా ఆశగా అడిగాడు ఆచార్యులు.

"ఆc, కాంగ్రెస్ విప్లవసంస్థే! కాని నాయకత్వం ప్రత్యాఘాతకం" అన్నాడు రాయిస్టు.

"మరి మీరు కాంగ్రెస్‌లోనుంచి వెళ్ళిపోయారె" అన్నాడు ఆచార్లు.

"తీవ్రవాదులు మా మాటలు వినలేదు. అందువల్ల పద్ధతి మార్చవలసి వచ్చింది."

## దేశం ఏమయ్యేట్టు?

"పద్ధతా? పతకమా?" అన్నాడు కా. సో.

"వాళ్ళకు రెండూ ఒకటే" అన్నాడు కిసాన్.

"రోజుకొక పార్టీ – గడియకొక పతకం" అని కేకలు వేశాడు కమ్యూనిస్టు.

"మీ రెవరండి!" అని అడిగాడు రామారావు.

"మేం కమ్యూనిస్టులం, మూడో అంతర్జాతీయ శాఖ వారం."

"అదంతా రష్యా సాంప్రదాయం! బొత్తిగా విదేశీయం" అన్నాడు ఆచార్యులు.

"అవును, ఇక్కడ పరిస్థితులు తెలియవు. సిసలైన సోషలిజం మాది. దేశవాళీసరుకు" అన్నాడు కాంగ్రెస్ సోషలిస్టు.

ఇక్కడేపుట్టి, ఇక్కడే పెరిగి, ఇక్కడే పక్వానికొచ్చే సోషలిస్టులంమేం" అన్నాడు కిసాన్ సభైట్. "వీళ్ళ కమ్యూనిజం కొత్త పెత్తందారీతనం."

"వీళ్ళింకా బొడ్డుడూడని కమ్యూనిస్టులు. వీళ్ళని మేం ఇండియన్ కమ్యూనిస్టులు అంటాం. వీళ్ళు తెలుసుకోలేని ఫేసిస్టులు' అన్నాడు రాయిస్టు.

"మీ రెవరండి!" అని అడిగాడు రామారావు.

"మేం రాయిస్టులం."

"రెనగేడ్స్" అని మొదలుపెట్టాడు. కమ్యూనిస్టు కోపంతో ఆవేగంతో అతనికళ్ళు ఎర్రబడినై –"వీళ్ళనాయకుణ్ణి మేం అంతర్జాతీయ పార్టీనుంచి వెళ్ళగొట్టాం. వీళ్ళ

నాయకుడు చైనాలో ఏమిటో చేశాడు. వీళ్ళనాయకుడికి ఇంగ్లీషు గ్రామరు రాదు."

"రైటో! రైటో!! మాపార్టీలో జేరతామని మాకు ప్రణాళిక వ్రాసి ఇచ్చి జేరకుండా మమ్మల్ని మోసంచేసి తర్వాత మామీదే దుమ్మెత్తిపోశాడు" అన్నాడు కాంగ్రెస్‌సోషలిస్టు.

"నిజం, నిజం, మమ్మల్నీ అలాగే చేశాడు. కాంగ్రెస్లో మరో పార్టీ వుండకూడదని చెప్పి చెప్పి తానే మరో పార్టీ పెట్టాడు" అన్నాడు కిసాన్.

"అంతా కాంగ్రెస్లో చేరి కాంగ్రెస్‌ని బలపరచమని చెప్పి చెప్పి తాను బయటకొచ్చి మరో పార్టీ పెట్టాడు" అన్నాడు కమ్యూనిస్టు.

"ద్రోహి! ద్రోహి! ద్రోహి" అని కేకలు.

"మీరంతే! పరిస్థితుల్నిబట్టి పద్ధతులను మార్చుకొనటం మీకు చేతగాదు. యుద్ధం వచ్చింది. ఫేసిజం వస్తూవుంది. మనం మారాలి..."

"ఏం ఫేసిజం వస్తే?" అన్నాడు ఆచార్యులు.

"ఫేసిజం ఇంపీరియలిజంకంటె ఘోరమైంది" అన్నాడు రాయిస్టు.

"అనేది ఒప్పుకుంటాను" అన్నాడు కమ్యూనిస్టు.

"నిజమే!" అన్నాడు కాంగ్రెస్‌సోషలిస్టు.

"మేం ఫేసిస్టు వ్యతిరేకతీర్మానంచేశాం" అన్నాడు సభైట్.

"ఆచార్యులవారు ఇంగ్లండు గెలవవలసిందే. కాని మేం సహాయం చెయ్యం అంటాడు. గెలవవలసిన దానికి సహాయం చెయ్యకపోవటం బుద్ధి జాడ్యం—" అన్నాడు రాయిస్టు.

"అది తప్పే!" అన్నాడు కమ్యూనిస్టు.

"ఈ కమ్యూనిస్టులు ఇంగ్లండు రష్యాకి సహాయం చెయ్యాలిగాని మేం ఇంగ్లండుకు సహాయం చెయ్యం అంటారు."

"అది తప్పే" అన్నాడు ఆచార్యులు.

"కానే కాదు" అన్నాడు కమ్యూనిస్టు.

"కాకపోవచ్చు" అన్నాడు కా. సో.

"కాదు" అన్నాడు కిసాన్ సభైట్.

"ఈయన ఊరికే ఇంగ్లండుకి సహాయం చెయ్యమంటాడండీ.... జవహరలాల్ మీవాడేగదా...." అని మొదలు పెట్టాడు ఆచార్యులు.

"కాదు"

"కాదు"

"కాదు"

కాంగ్రెస్ సోషలిస్టు అనుమానిస్తూ పూరుకున్నాడు.

"పోనీ ఆయన ఎంత బాగా చెప్పాడో చూడండి—"

"చూడం"

"చూడం"

"చూడగం"

"ఓ బ్రిటిష్ ఇంపీరియలిజమా! నువ్వు వెళ్ళిపో అన్నాడు జవహరలాల్" అని చెప్పాడు ఆచార్యులు.

రాయిస్టూ, కిసాన్ సభైటూ, కమ్యూనిస్టూ బిగ్గరగా నవ్వుతారు.

"ఇంపీరియలిజం పొమ్మంటే పోతుందా?" అన్నాడు కమ్యూనిస్టు.

"మనల్ని అడిగివొచ్చిందా మనం పొమ్మంటే పోటానికి?" అన్నాడు కిసాన్ సభైట్.

"పోకపోతే ఏంచెయ్యాలో చెప్పాలి" అన్నాడు రాయిస్టు

"నువు చెబుతావా?" అని అడిగాడు ఆచార్యులు.

"ఓ!" అన్నాడు రాయిస్టు.

"అక్కర్లేదు. నువ్వు ఇంపీరియలిస్టు ఏజంటువి!" అన్నాడు కమ్యూనిస్టు.

"అవును చెప్పక్కర్లేదు" అన్నాడు కిసాన్ సభైట్.

"అయ్యా! రాయిస్టులమాటలు నమ్మకండి. వాళ్ళు స్వామిద్రోహులు" అన్నాడు ఆచార్యులు.

"అవును ద్రోహులు" అన్నాడు కాంగ్రెస్ సోషలిస్టు.

"ఎన్నిపార్టీలు మారేరో కనుక్కోండి" అన్నాడు కమ్యూనిస్టు.

"ఆ విషయంలో మీరు మరీ గొప్పవారండీ." అని కమ్యూనిస్టుని చూపించాడు ఆచార్యులు.

"ఒరి ఫేసిస్టూ... మేం అధికారం స్వాధీనం చేసుకో డానికి అలాంటిపనులు చేస్తాం" అన్నాడు కమ్యూనిస్టు.

"మీ యిద్దరూ ఫేసిస్టులే" అన్నాడు కిసాన్.

"మీ ముగ్గురూ ఫేసిస్టులే" అన్నాడు రాయిస్టు.

"ఇక ఫేసిస్టు కాంది ఎవరు?" అని అడిగాడు రామారావు.

"నేను"

"నేను"

"నేను"

"నేను"

"నేను"

"ఇక ఫేసిస్టు ఎవరు?" అని ప్రశ్నించాడు రామారావు.

"వాళ్ళు నలుగురు"

"వాళ్లు నలుగురు"

"వాళ్లు నలుగురు"

"వాళ్ళు నలుగురు"

"వాళ్లు నలుగురు"

ఈ కేకలతో జైలంతా దద్దరిల్లిపోయింది. అలారం బెల్ గణగణా మోగింది. వార్డన్ పరుగెత్తుకుంటూ వచ్చాడు. సెల్ లో వాళ్ళంతా కేకలు పెట్టుకుంటూ "నువ్వు ఫేసిస్టువి" అంటే "నువ్వు ఫేసిస్టువి" అని చేతులు చేతులు కలుపుకున్నారు.

రామారావు బిక్క మొహంవేసి, ఆ దృశ్యాన్ని చూడలేక ఆ మోత భరించలేక, కళ్ళు మూసుకొని, చెవులు మూసుకున్నాడు.

రామారావు కంతా అయోమయంగావుంది. దేశంలోని రాజకీయ పార్టీలు యీ విధంగా వుంటే దేశం యేమయ్యే టట్లో అతనికి బోధపడలేదు. బయటకు వచ్చి విచారంగా జైలు వరండాలో నడుస్తుంటే ఒక వ్యక్తి యిలా అడిగాడు—

"ఎక్కడనుంచి వస్తున్నారు?"

"నెం 24"

"వాళ్ళేమన్నా కలిసేటట్టున్నారా?"

"లేదు!"

"బలే! హిందూదేశం హిందువులది. వీళ్ళంతా మహమ్మదీయులకు దేశాన్ని అమ్మాలని చూస్తున్నారు."

"తమ రెవరు?"

"హిందూమహాసభవాళ్ళం."

రామారావు మాట్లాడలేదు. అతడు "అఖండ హిందూ స్థాన్" "అఖండ హిందూస్థాన్" అని కేకలు వేస్తూ పోయాడు? రామారావు రెండడుగులు వేసేసరికి మరొక వ్యక్తి వచ్చాడు.

"ఏదో తమరు హిందూమహాసభవారితో మాట్లాడుతున్నారే" అన్నాడు.

"అవును,"

"ఏమంటున్నారు?"

"నెం 24 సంగతి అడిగాడు."

"నాకు తెలుసు. మొదటనుంచీ మేం అనుమానిస్తూనే వున్నాం. వాళ్ళంతా సమయం వచ్చేసరికి ఒక్కటే అవుతారు. వాళ్ళంతా హిందువులే! హిందూరాజ్యం స్థాపించడానికి ప్రయత్నిస్తున్నారు!!"

"తమరెవరు?"

"ముస్లింలీగ్"

"ఓహో!"

"పాకిస్తాన్! పాకిస్తాన్! పాకిస్తాన్!" అని కేకలు వేసుకుంటూ అతను వెళ్ళిపోయాడు.

రామారావు వుక్కిరి బిక్కిరి అయ్యాడు. పిచ్చి ఆసుపత్రిలో అడుగు పెట్టానని అనుకున్నాడు. జైలు గేటు దాటి బైట అడుగు పెట్టేటప్పటికి, "బర్మామీద బాంబులు" "జపాను విజయాలు" "బర్మామీద బాంబులు" "జపాను విజయాలు" అని పేపర్లు అమ్ముకునే పిల్లల కేకలు వినిపించినై. ఇక రామారావుకి ఒక్క అడుక్కూడా ముందుకు పడలేదు.

మరొక వ్యక్తి నెమ్మదిగా అతన్ని సమీపించాడు. బిళ్ళగోచీ పెట్టాడు. లాల్చీ తొడిగాడు. జరీఅంచు కండువా వేశాడు. నెమ్మదిగా రామారావు దగ్గరకు వచ్చి "ఏమండీ?" అన్నాడు.

రామారావు వులిక్కి పడ్డాడు.

"మన సంగతి ఏమన్నా తేలిందా, అండీ?" అని అడిగాడు నూతన వ్యక్తి.

"ఏం సంగతి?"

"ఆంధ్రరాష్ట్రం?"

రామారావు తల గిర్రున తిరిగింది. ఆ వ్యక్తిని చూడలేకపోయాడు. సహించలేకపోయాడు. ముందుకి చూశాడు. అంధకారం. ఇదివరకు సాధారణంగా అతనికి మూడు ప్రశ్నలు తడుతుండేవి. ఇప్పుడు ఒక్కటే ప్రశ్న— మూడుసార్లు తట్టింది.

1. దేశం ఏమయ్యేట్టు?
2. దేశం ఏమయ్యేట్టు??
3. దేశం ఏమయ్యేట్టు???

జపాన్ బర్మాని ఆక్రమించుకోక ముందూ
కమ్యూనిస్టుపార్టీ ఇది ప్రజాయుద్ధ మనే
విషయం గ్రహించక ముందూ వ్రాసిన కథ ఇది.

# కార్యకారుడు

శిశిరకుమారబాబు రైలు దిగాడు. అది అట్టే పెద్ద స్టేషన్ కాకపోటంవల్ల ప్రయాణీకులు ఎక్కువమంది లేరు. సామాన్లు మోసే కూలీలు అసలే లేరు. ఒక పోర్టరు మాత్రం ఎర్రజెండా ఆకుపచ్చజెండా కలిపి చుట్టి చంకలో పెట్టుకొని అటూ ఇటూ తిరుగుతున్నాడు. ఆ రైలు మార్గమంతా తన జండాల ప్రభావంవల్లే నడుస్తూందని అతని అహంకారం.

అతన్ని పిలిచి శిశిరకుమారమాబు అడిగాడు—

"వెంకయ్యగారిల్లెక్కడ?"

"ఏ వెంకయ్య? ఇక్కడ వెంకయ్యలు కొల్లల కొల్లలున్నారు!" అన్నాడు పోర్టరు.

శిశిరకుమారబాబుకి వెంకయ్య యింటిపేరు తెలియదు. తిలకం భర్త అని మాత్రమే తెలుసు. ఒక ఫ్యాక్టరీలో మేనేజరనీ; కూలీలతో కలిసి సమ్మె చెయ్యటం వల్ల ఈమధ్యే ఉద్యోగం ఊడిందనీ తెలుసు. ఆ సంగతే పోర్టరుకి చెప్పాడు.

"కామ్రేడ్ వెంకయ్యా! తెలియకేం?" అన్నాడు పోర్టరు.

"ఎక్కడ!"

పోర్టరు పొలాల్లోనుంచి వెళ్ళే కాలిబాటను చూపించాడు. దారి తిరిగినన్ని మెలికలూ చేత్తో చూపిస్తూ

చెప్పాడు. "ఇట్లా వెళ్ళి ఎడంపక్కకి తిరిగి, ముక్కుకు సూటిగా ఇరవై గజాలు నడిస్తే వారిల్లొస్తుంది."

వాన లేకపోవటంవల్ల చేలన్నీ నెరలిచ్చి వున్నయి. గట్లలో పెద్ద పెద్ద కలుగులున్నయి. పక్కనున్న ఫ్యాక్టరీ శిధిలమయిన పురాతన కట్టడంలాగు పడివుంది. సంస్కృత భాషను తలచుకున్నపుడు కలిగే విషాదంకంటె ఎక్కువ విషాదాన్ని కలిగిస్తూవుంది. ఒక్క ఫ్యాక్టరీగొట్టంమాత్రం ఆ విషాద దృశ్యాన్ని ఛేదించుకొని నిలబడి భవిష్యత్తులోకి చూస్తూ వుంది.

శిశిరకుమారబాబు కాలిబాటనే పడిపోయి పోర్టరు చూపించిన ఇంటిదగ్గరకు జేరుకున్నాడు. అది పూరిల్లు. పొరపాటు పడ్డానేమోనని భవంతికోసం అటూ ఇటూ చూశాడు. కాని దగ్గరవున్నవన్నీ పూరిళ్ళే!

ఆ ఇంటిపక్కనే చెట్టుకింద కూర్చుని చదువుకుంటున్న వ్యక్తి అతన్ని చూశాడు. ఆ వ్యక్తి కొంచెం ముతకమనిషి. వాడిచూపులు కలిగిన మనిషి. బాహ్య ప్రపంచంసంగతి తప్ప తన జేబుకి చిరుగున్నసంగతే తెలుసుకోలేని మనిషి. భోజనంలోకి బంగాళా దుంపకూర బాగుంటుందో, కాకరకాయపులుసు బాగుంటుందో ఇంకా తేల్చుకోని మనిషి!!

"ఏంకావాలి?" అని అడిగాడు.

"వెంకయ్యగారిల్లిదేనా?"

"అదే."

"ఆయనభార్య ఇంట్లోవుందా ?"

"ఎవ్వరూ ?"

"ఆయన భార్య."

"భార్యలు ఇంట్లోవుండక ఏంచేస్తారు! ఇంట్లోనే వుంటారు. ఎప్పుడూ ఇంట్లోనే వుంటారు" అని చెప్పి ఆ వ్యక్తి మళ్ళీ పుస్తకం చదువుకోవటం మొదలుపెట్టాడు.

శిశిరకుమారబాబుకి కష్టం వేసింది. "నేను వూళ్లో వాళ్ల భార్యలసంగతి అడగటంలేదు. వెంకయ్య భార్య సంగతి అడుగుతున్నాను" అన్నాడు.

"వెంకయ్య భార్యమాత్రం వూళ్లోవాళ్ళ భార్య కాదూ ?" అని మొహాన విసిరికొట్టినట్టు జవాబు చెప్పా డతడు. ఈసారి తలకూడా పైకెత్తకుండా జవాబు చెప్పాడు.

శిశిరకుమారబాబుగారికి కోపం వచ్చింది. బొత్తిగా సంస్కారంలేని మనిషి! సోషలిజం ప్రచారంలోకి రాక ముందు పల్లెటూళ్ళు ఎంత మర్యాదగా వుండేవి! ఈసారి తాను రాసే పుస్తకంలో ఇటువంటి విచిత్రవ్యక్తి నొకణ్ని సృష్టించి, ఇప్పటి యువకుల్ని దెబ్బలియ్యాలి!

ఇక ఆ వ్యక్తితో లాభంలేదని తానే నెమ్మదిగా వెళ్ళి ఆ ఇంటితలుపు తట్టాడు. లోపల అడుగుల చప్పుడు వినిపించింది. ఒకక్షణం ఆమే అనుకున్నాడు. ఒకక్షణం కాదనుకున్నాడు. ఆ పదధ్వని ఆమెదే అనుకున్నాడు. మళ్ళీ కాదనుకున్నాడు.

ఆమే!!!

కాని ఎంతమారిపోయింది! గుర్తుపట్టటానికే వీల్లే కుండా వుంది! అతడు ఆశ్చర్యంతో అలాగే నిలబడి పోయాడు. అతన్ని చూచి ఆమెకూడాఅంతే — అలాగే నిలబడిపోయింది. అతని మొహాన్నుంచి చూపులు తిప్పుకో లేకపోయింది. అతని మొహంమీాద చూపులు ఆనటం లేదు. ఆమెకు అతని మొహం అలికినట్లు కనిపించింది. కాని అతనే అని తెలుసు. కాని బాధో ఆనందమో, ఆ వికారం ఏమిటో తెలియటంలేదు. హృదయం మాత్రం చెడిపోయిన గ్రామఫోను రికార్డులా దుర్రుమని మోత పెట్టింది. కదలకుండా, మెదలకుండా, రెప్ప వెయ్యకుండా చూస్తూ అలాగే నిలబడిపోయింది.

శిశిరకుమారబాబుకి ఏమీా తోచక అటుతిరిగి ఇటు తిరిగి, గొంతుసవరించుకొని "ఇప్పుడే వచ్చాను" అన్నాడు.

"రండి"—కాని గడపలోంచి కదల్లేదు. కదలటం మరచిపోయింది.

"నిన్ను చూచిపోదామని వచ్చాను," అన్నాడు. ఆమాట ఆమెకు వినిపించింది. ఒక్క-క్షణం ఆమె పాలిపో యిన మొహం జీవకళతో ప్రకాశించింది. ఒక్క-క్షణం ఆనం దంతో చూపులు మెరసినై. ఒక్క-క్షణం పెదిమలమీాదికి చిరునవ్వు వచ్చినట్లే వచ్చింది!

"రండీ"

ఇద్దరూ లోపలికి వెళ్ళారు.

ఆ యింటి కంతకీ అదొక్కటే గది. ఆ గదిలో సామాన్లు అలంకారాలూ ఎక్కువగా లేకపోయినా, పరిశుభ్రంగా వుంది అలమరలో పుస్తకాలున్నాయి. కుర్చీకి ఎదురుగా బల్లమీద గ్లోబ్ వుంది. గోడకు భూగోళపటం తగిలించివుంది. పక్కనే ఒక ఫొటో వుంది—అదెవ్వరిదో శిశిరకుమారబాబుకి తెలియలేదు. అతని ముప్పై సంవత్సరాల జీవితంలో ఆఫొటో ఎక్కడా తగల్లేదు. ముడివేసుకోవటం చేతగాని నెక్టై, ముడతలుపడ్డబూర్నీస్ కోటూ, బూచివాని బుల్లిగడ్డం, హృదయాల్లోకి దూసుకుపోయే చురుకుచూపులూ—ఆ ఫొటో ఎవ్వరిదో శిశిరకుమారబాబుకి తెలియలేదు. అసలా ఫొటో వెంకయ్య ఎందుకు తగిలించాడో బోధపడలేదు. అతడీవిధంగా గదిని పరిశీలిస్తుంటే తిలకం అతన్ని క్రీగంట చూస్తూ నిలబడింది. అతడు రావటం ఆమెకు సంతోషం కలిగించినా, తానిటువంటికోపంలో వుంటున్నాననే సంగతి అతనికి తెలిసినందుకు విచారపడ్డది.

"అంతా బాగున్నారా?" అని అడిగింది.

"అంతా ఎవ్వరు? నే బాగానే వున్నాను," అన్నాడు. అతనికి తలిదండ్రులు చిన్నతనంలోనే పోయారు. మరింకెవ్వరూ లేరు. ఆ సంగతి ఆమెకు తెలుసు. "నువ్వో" అని అడిగాడు.

ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగినై. అతడు చూస్తాడేమోనని భయంతో అతని వైపుకి వీపు తిప్పి పుస్తకాలు సరుతూ నుంచుంది. పుస్తకంఅనుకోని పుస్తకాలకింద వున్న పేరుప

తీసేటప్పటికి అరలోని పుస్తకాలన్నీ కిందపడి మోతచేసినయి. దడదడకొట్టుకునే హృదయంతో ఆమె అలాగే నిలబడింది.

మళ్ళీ బాబే అడిగాడు: "మీావా రెక్కడో మేనేజరని విన్నాను."

"అవును"

"బాగున్నారా?"

"రిజైనిచ్చారు"

"ఎందుకు?"

"ఏమో!"

"ఇప్పుడేం చేస్తున్నారు?"

"సమ్మెలు చేస్తున్నారు-" ఇక అక్కడ వుండలేకపోయింది తడబడుతూ గబగబా లోపలికి వెళ్ళిపోయింది.

ఏదెలా వున్నా వెంకయ్య వుద్యోగానికి రిజైనివ్వటం ఆమెకు ఇష్టంలేదని శిశిరకుమారబాబు గ్రహించాడు. గ్లోబ్ గిర్రునసంతోషంతోతిప్పాడు. దేశాలువస్తున్నై—పోతున్నై. మళ్ళీ ఆదేశాలే వస్తున్నై—మళ్ళీ ఆదేశాలే పోతున్నై. కాలచక్రంకంటే అనేకరెట్లు వేగంగా తిరుగుతూవుంది గ్లోబ్. అతడు దాన్ని తదేకధ్యానంతో చూశాడు. అయిదారు సంవత్సరాల కిందట జరిగిన తమ కథను జ్ఞాపకం చేసుకోటానికి యత్నించాడు:

అప్పుడతడు కాలేజీలో బి. ఏ. చదువుతుండేవాడు. తిలకం ఇంటర్మీడియట్ చదువుతూండేది. అతడు కాలేజీ మేగజీన్లో పద్యాలు వ్రాశాడు. మర్నాడు తిలకం కనిపించి

అతని పద్యాలు పొగిడింది. అప్పట్నుంచీ ఇద్దరికీ స్నేహం కుదిరింది. అతడు తాను రాసిన పద్యాలు చదివి వినిపిస్తే ఆమె విని సంతోషించేది. కాలేజీ విడిచిపెట్టింతర్వాత ఇద్దరూ రోజూ షికారు వెళ్ళేవారు. సముద్రంవొడ్డున కూర్చొని అలల్ని తిలకించేవారు. సూర్యాస్తమయాన్ని తిలకించేవారు. తన్మయత్వం చెందేవారు. ఆ వాతావరణంలో అతడు వ్రాసిన ప్రేమగీతాలు అర్ధనిమీలితనేత్రాలతో పాడేవాడు. ఆమె తన ఆనందాన్నంతా నిట్టూర్పుల్లో విడిచేది! కాని రోజులు ఒకేరకంగా గడవ్వు. ఒక రోజు ఇద్దరికీ తగాదా వచ్చింది-చాలా స్వల్పవిషయం. తిలకం పన్నీరుపువ్వుని చూచి, "ఆ మొండిచెట్టుకి అంత సువాసనగల పువ్వుఎలాపుట్టిందో!" అన్నది. శిశిరకుమార బాబు "చిద్విలాసం! వికారంగావుండే నీ తండ్రికి నువ్వెలా పుట్టావు?" అన్నాడు. అతడు నవ్వులాటకే అన్నాడు. కాని ఆమెకు కోపం వచ్చింది. అప్పటినుంచీ అతన్ని కలుసుకోవటం మానేసింది. కొన్నాళ్ళకు ఒక ఫ్యాక్టరీ మేనేజర్ని వివాహం చేసుకుందని తెలిసింది. తనమీద కసితీర్చుకోటానికే ఈపని చేసిం దనుకున్నాడు శిశిరకుమారబాబు. తరువాత మరికొన్ని సంగతులు తెలిసినయి. తిలకం భర్త సోషలిష్టనీ, అతన్తో తిలకం సరిగ్గా కాపురం చెయ్యటం లేదనీ... ...

ఈవిధంగా ఆలోచించుకుంటూ, తిలకం కాఫీ తెచ్చి బల్లమీద పెట్టేవరకూ అతడు గమనించలేదు.

"పుచ్చుకోండి"

"ఆఁ"

"పుచ్చుకోండి"

"నాకోసం ఎందు కింత శ్రమ?"

"ఇది మా కాఫీటైమే!"

శిశిరకుమారబాబుకి ఆశాభంగమైంది. "మీకోసం కాకపోతే ఇంకెవరికోసం శ్రమపడతాను," అంటుం దను కున్నాడు. నెమ్మదిగా ఆమెను చూస్తూ కాఫీ ఒక్క గుటక వేశాడు.

"బాగుంది. నీచేతి కాఫీయేనా?"

"కాదు."

ఆమె మనస్సులోమనసులేక కాదని జవాబుచెప్పింది. లేకపోతే కాఫీకూడా తానే చేస్తున్నాననే సంగతి అతనికి తెలియనివ్వటం ఇష్టంలేకో, లేకపోతే ఇంకెందుకో! ఆలో చించకుండా జవాబుచెప్పింది. కాని అతనికిమాత్రం ఆ జవాబు హాయిని కూర్చింది. చమత్కరిస్తున్న దనుకొని సంతోషంతో బిగ్గరగా నవ్వాడు. ఆమె తబ్బిబ్బుపడి అతన్ని వెకిలిగాచూచింది.

ఇంతలో బయటనుంచి అడుగుల చప్పుడు వినిపిం చింది. ఆమె మాట్లాడకుండా, చితిలోకి నడిచే సతిలాగా నడిచి తలుపుదగ్గరకు వెళ్ళింది. బయట పుస్తకం చదువు తున్న వ్యక్తి మరిద్దరితో ప్రవేశించాడు. శిశిరకుమారబాబు నవ్వు విని ముగ్గురూ వాకిట్లో ఆగారు. చెట్టుకిందనుంచి

వొచ్చిన వ్యక్తి చిటచిటలాడుతూ నిలబడ్డాడు. మిగిలిన ఇద్దరూ ఫీరుల్లాగు నిలబడ్డారు.

తిలకం తొందరగా పరిచయం చెయ్యటానికి ప్రతిఘటించింది. "వీరు శిశిరకుమారబాబు—"

అంతే! ఆపేరు వినేటప్పటికే వెంకయ్య ముఖ కళవళికలు మారిపోయినై. అంతకంటే చెప్పటానికి అవకాశం ఇవ్వలేదు. చిరునవ్వుతో శిశిరకుమారబాబు దగ్గరకువచ్చి, "మీరా? ఎవ్వరో అనుకున్నాను. క్షమించండి. మీపరిచయంచేసుకోవాలని చాలాకాలంనుంచి ప్రయత్నిస్తున్నాను. నా భార్య మిమ్మల్ని గురించి చాలా చెప్పింది. మీరు రాసినపుస్తకాలన్నీ మా ఇంట్లో వున్నాయి. మీ ఆఖరి విరహవేదనకూడా ఉంది. నా భార్యకు మీ పుస్తకాలంటే చాలా మక్కువ. భోజనంకూడా మానేసి, నన్నుకూడా వొదిలేసి చదువుతూ వుంటుంది." అని కరస్పర్శ చేశాడు.

శిశిరకుమారబాబు కలవరపడ్డాడు. వెంకయ్య తన్నింత హృదయపూర్వకంగా ఆహ్వానిస్తాడని అతడనుకోలేదు. తన్నుచూడగానే చొక్కాచేతులు పైకిమడచి 'వర్గకలహం' 'విప్లవ చైతన్యం' 'రుధిరం' 'రక్తం' అంటాడనుకున్నాడు.

తిలకం సమాధిలాగు నిలబడి చూస్తుంది.

వెంకయ్య తన స్నేహితుల్ని పరిచయం చేశారు.

అందులో వొకరు సర్దార్ సుబ్బావధాన్లు. వారు ఉపన్యాసకులు. ఎండిపోయిన కార్మికుల రక్తనాళాల్లో

నూతనరక్తాన్ని ప్రవహింపచెయ్యగలిగినవక్త. రెండోవారు కా. మేడ్ అచ్చయ్యగారు సమ్మెకమిటీ సెక్రటరీ. సమ్మెలు నిర్వహించటంలో అందెవేసిన చెయ్యి. శిశిరకుమారబాబు సర్దార్ సుబ్బావధాన్లుకి షేక్‌హాండివ్వబోతే అతను నమస్కారం పెట్టాడు. కామ్రేడ్ అచ్చయ్యకు నమస్కారం పెడితే అతడు సిగ్గుపడి వెకిలినవ్వునవ్వి తలవంచుకున్నాడు.

అంతా మళ్ళీ కాఫీకి కూర్చున్నారు. మిగిలిన ముగ్గురూ కాఫీతాగుతూ సమ్మెనుగూర్చి చర్చించుకుంటూ వుంటే శిశిరకుమారబాబు ముళ్ళమీద కూర్చున్నట్లు కూర్చున్నాడు.

"ఇక ఒకరోజుకూడా సమ్మెసాగదు. కూలివాళ్ళు తిండిలేక చస్తున్నారు" అన్నాడు కామ్రేడ్ అచ్చయ్య.

"ఉపన్యాసాలిద్దాం. మీటింగు పెట్టించు" అన్నాడు సర్దార్ కామ్రేడ్!

"తిండికిలేదంటే ఉపన్యాసాలిస్తానంటావ్! ఇంకానయం, భావకవిత్వం రాస్తానన్లా?" అన్నాడు కామ్రేడ్ అచ్చయ్య.

"ఏం చేద్దామంటావ్?"

"ఏం చెయ్యాలో తెలియటంలేదు. ఏదోకటి చెయ్యాలి."

"దేశంలోని మిగిలిన కార్మికసంఘాలను సహాయం చెయ్యమని కోరదాం. ఏదన్నా సహాయం లభిస్తే మరొకవారంరోజులు గడపొచ్చు" అన్నాడు వెంకయ్య.

"ఇలా ఎన్నాళ్ళు?" అన్నాడు కామ్రేడ్.

"వారం రోజులు గడిస్తే చాలు. అప్పటికి యజమాన్లు లొంగితీర్తారు," అన్నాడు వెంకయ్య.

"లొంగకపోతె!"

"మనం లొంగాలి"

"ఇంతా కష్టపడి చివ్వరికి అంతే! అయితే ఈ బాధలన్నీ ఎందుకూ?" అని నిట్టూర్చాడు సర్దార్.

"ఈ చిన్న పోరాటాల్లో జయం లభిస్తుందని గట్టిగా చెప్పలేం. ఇప్పుడు మనం ఓడిపోయినా అంతిమపోరాటానికి కావలసిన అనుభవం మనకు దొరుకుతుంది. ఈ పోరాటాల వల్ల కార్మికుల్లో చైతన్యం కలుగుతుంది. అదే ఇప్పుడు మనకు కావలసింది!" అన్నాడు వెంకయ్య.

"ప్రపంచ కార్మికులారా! ఏకము గండు" అని మోగాడు సర్దార్.

కాఫీ పూర్తయింతర్వాత కూడా చాలాసేపు మాట్లాడుకున్నారు. మధ్యమధ్యలో ఉద్రేకాలు పెరిగి దూషించుకున్నారు. శిశిరకుమారబాబు అయోమయంగా కూర్చున్నాడు. సంస్కారం లేని, వాళ్ళని చూస్తే అతనికి అసహ్యం వేసింది. తిలకంలో మార్పూ, ఈ కొంపలో ఆమె పడే బాధా అప్పుడతనికి అర్థమైనై.

ముగ్గురూ లేచారు. వెంకయ్య శిశిరకుమారబాబు వైపు తిరిగి, "కొంచం పనుంది వెళ్ళివస్తాను. నాలుగురోజులుంటారుగా" అన్నాడు.

"లేదు. మద్రాసులో కవులసమ్మేళనకు వెళ్తూ చూచిపోదామని దిగాను. రేపు వుదయం వెళ్ళిపోవాలి."

"అలా కాదు. నాలుగు రోజులన్నా వుండాలి." అని వెంకయ్య కోరాడు.

"ఉండండి" అన్నాడు సర్దార్.

"ఉండండి" అన్నాడు కామ్రేడ్.

తిలకం చూపుల్తో ప్రార్థించింది. అతడు కష్టంమీద అంగీకరించాడు. వెంకయ్య బయటికివెళ్తూ జ్ఞాపకంచేశాడు. "నాలుగు రోజులంటే, నాలుగురోజులు."

* * * *

మర్నాడు వెంకయ్యరాలేదు. ఈ అయిదు సంవత్సరాల్లో తిలకం అంత సంతోషంగా ఎప్పుడూలేదు. విద్యార్థిని దశలో వొదిలిన జీవితాన్ని మళ్ళీఅందుకుంది. తోటలో కూర్చొని శిశిరకుమారబాబుతో కబుర్లు చెప్పుకుంది. పూర్వదృశ్యాలన్నీ జ్ఞాపకం తెచ్చుకొని ఆనందంతో పొంగిపోయింది. అతడు రాసిన పద్యాలను చదివి వినిపించమని కోరింది. అతడు గొంతుబిగపట్టి విగ్గు చేత్తో సవరించుకుంటూ, అర్ధనిమీలిత నేత్రాలతో పాడి వినిపించాడు:—

నీ తలలోని పువ్వునై
నీ జడలోని గంటనై
కంటిమీది రెప్పనై
జాకెట్టు చుక్కనై

నివసిస్తాను
వసియిస్తాను!
నీవుకట్టిన నీలాంబరాలలో
నీవుతొడ్గిన సిల్కు జంపర్లలో
కులికించి
మురిపించి
నిద్రపోతాను
నిద్రపోలేను ! !

అతని పాటల్ని ఆమె మెచ్చుకుంది. కాని పూర్వం కలిగిన తన్మయత్వం కలగలేదు. ఆమె భావతంత్రులు తెగిపోయినవా?

ఏమిటిది !
ఏమిటిది !

రాత్రంతా ఏడుపుతో ఆలోచనల్తో నిద్రపోలేదు తిలకం.

*　　　*　　　*

రెండోరోజుకూడా వెంకయ్య రాలేదు. కూలీలను ఆర్గనైజ్ చెయ్యటానికి వెళ్ళివుంటాడని చెప్పింది తిలకం.

"ఆర్గనైజ్ చేస్తాడా?"

"అంటే !"

"కూలీలందరు ఏకము కావలెరా!" అని పాడింది. ఇద్దరూ నవ్వుకున్నారు. కాని ఆ రోజు శిశిరమూకుర బాబుని పద్యాలు పాడమని తిలకం అడగనూలేదు, అతను పాడనూ

లేదు. ఆరాత్రి మాత్రం తిలకం పడుకోని 'కూలీలందరు ఏకము కావలెరా!' అనే పాట పదిపన్నెండుసార్లు పాడు కుంది. ఆశ్చర్యమేమిటంటే పాడుతున్నకొద్దీ ఆమెకా పాట బాగుంది. శిశిరకుమారబాబు పాటలివ్వలేకపోయిన ఆనందం ఆ పాట ఇచ్చింది.

*   *   *

మూడోరోజు కూడా వెంకయ్య రాలేదు. ఇవ్వాళ తిలకం షికారు వెళ్ళలేదు. శిశిరకుమారబాబు అడిగితే "తలనొప్పిగా వుంది. మీరు వెళ్ళిరండి" అని చెప్పింది. అతడు తిరిగి వచ్చేటప్పటికి తిలకం పుస్తకం చదువుతూ కూర్చుంది.

"ఎలావుంది?" అని అడిగాడు బాబు.

"బాగుంది"

"ఏమిటి?"—వింతగా అడిగాడు.

"పుస్తకం"

"పుస్తకం కాదు"

"మరేమిటి?"

"తలనొప్పి"

"ఎవ్వరికి?"

ఇక అతడు ఎక్కువ ప్రశ్నించలేదు.

నాలుగో రోజుకూడా వెంకయ్య రాలేదు. ఇవ్వాళ తిలకం శిశిరకుమారబాబుకి అసలు కనిపించేలేదు. వంటింట్లో కూర్చొని అదే పుస్తకం తదేకధ్యానంతో చదువుతూవుంది.

శిశిరకుమారబాబుకి ఏమీ తోచక దాసీదానితో సరసా లాడుతుంటే చూచింది. కాని ఏమాత్రం ఆశ్చర్యపడలేదు. ఎందుకు పడుతుంది? ఆ పుస్తకంలో ఈ సంభాషణ చదువుతూ వుంది—

భూదేవి—నీవు ఎందుకు రాస్తున్నావ్?

కవి—కోకిల ఎందుకు పాడుతూవుంది?

భూదేవి—అది పక్షి

కవి—నేనూ పక్షినే!

భూదేవి—నీవు మనిషివి

కవి—అయితే!

భూదేవి—ఆ కృత్రిమ వాతావరణంలో వూపిరాడక పాతాళలోకంలో పడిపోతావు.

*　　　*　　　*

అయిదో రోజు వెంకయ్య వచ్చాడు. చాల గాబరాగా వున్నాడు. రేగిన జుట్టూ, పెరిగిన గడ్డం, దుమ్ము కొట్టుకున్న బట్టలూ-మాక్సింగోర్కీ పుస్తకం జీవం పోసుకొచ్చినట్లుంది. గదిలో అడుగు పెట్టగానే శిశిరకుమారబాబుని అడిగాడు—"తిలకం ఏదీ?"

అతన్ని చూచి శిశిరకుమారబాబు కొంచెం భయపడ్డాడు. ఇలాంటి వ్యక్తుల్ని గూర్చి పుస్తకాల్లో చదవటానికే అతడు భయపడతాడు. ఇక జీవితంలో ఎలా ఎదుర్కుంటాడు?

"తిలకం ఏది" అని మళ్ళీ అడిగాడు వెంకయ్య. ఈ సారి వెంకయ్యలో ఆదుర్దాకంటే విచారం ఎక్కువకనిపించింది.

"వంటగదిలో వుంది." అని చెప్పాడు బాబు.

"వంటగదిలోనా ?"

"అవును"

"ఏం చేస్తూంది!"

"వంటగదిలో ఏం చేస్తారు;"

"ఇడ్డెన్లా?" కోపంగా అడిగాడు వెంకయ్య. కాదు అన్నట్లు తలూపాడు శిశిరకుమారబాబు.

వెంకయ్య ఆలస్యాన్ని భరించలేకపోయాడు. "చెప్పు ఏం చేస్తూవుంది?" అని రెండడుగులు ముందుకు వేసి గద్దించాడు.

"చదువుతూవుంది" అని చెప్పాడు బాబు.

"ఏ పుస్తకం? నీ పుస్తకమా?" "కాదు, నీపుస్తకం."

వెంకయ్య ఒక్క నిట్టూర్పు విడిచాడు. గ్లోబ్ గిర్రున తిప్పాడు. గబగబా ఫోటోదగ్గరకు వెళ్ళాడు. "ప్రపంచ కార్మికులారా, ఏకము గండు" అని కేకవేశాడు.

ఆ కేకకు శిశిరకుమారబాబు ఉలిక్కిపడ్డాడు. వెంకయ్య అతని దగ్గరకు వొచ్చి చెవిలో రహస్యంగా చెప్పాడు. "అయితే ఇక నువ్వెందుకు ? నువ్వెళ్ళొచ్చు!"

ఈ మాటలకు శిశిరకుమారబాబు నిర్విణ్ణుడయ్యాడు. వెంకయ్యని అర్థంచేసుకోటానికి ప్రయత్నించాడు. తా నేం చేశాడు? వెంకయ్య కోర్కెమీాదే వుంటున్నాడాయెను— "మీాకింత కష్టంగా ఉందని తెలిస్తే అసలే వుండేవాణ్ని కాదు." అన్నాడు.

"అదేంమాట! ఉండకపోతే ఎలా!" అన్నాడు వెంకయ్య. అద్దంలో మొహం చూచుకుంటూ, జుట్టు సర్దుకుంటూ మాట్లాడాడు: "మీరు వుండాలి. అయితే నాలుగు రోజులు మాత్రమే వుండాలి." అని కులికాడు.

"ఎందుకు?"

వెంకయ్య అద్దందగ్గరనుంచి శిశిరకుమారబాబు దగ్గరకు వొస్తూ, సీరియస్‌గా చెప్పాడు:- "మీరిద్దరూ ప్రేమించుకున్నారని నాకు తెలుసు. మీ పూర్వపరిచయం నాకు తెలుసు. అందుకనే నిన్ను నాలుగురోజు లుండమని బలవంత పెట్టాను."

"ఎందుకు?

"చెబుతాను. ఇదివరకు మీ పరిచయమల్లా ఎక్కడో ఎప్పుడో కలవటం కవిత్వం మాట్లాడుకోవటం, తన్మయత్వం చెందటంతో సరిపోయింది. అంతేగాని నిన్ను మనుష్యునిగా అర్థంచేసుకునే అవకాశం తిలకానికి లేకపోయింది. అందుకని నిన్ను గురించీ, నీతో గడిపిన 'మధుర' క్షణాలను గురించీ ఎప్పుడూ ఆలోచించుకుంటూ, తన ప్రస్తుత జీవితంలో పోల్చుకొని విచారిస్తూ వుండేది. ఎంత చేసినా, ఎంత ప్రయత్నించినా కుటుంబజీవితం వేరు, ప్రేమజీవితం వేరు. కుటుంబభారం వుద్రేకంతో కూడిన ప్రేమ జీవితంలా వుండమంటే ఎలా వుంటుంది! ప్రియునికి మల్లే పొగుడుచూ, వర్ణిస్తూ 'ప్రేయసి, ప్రేయసీ నీ వాల్జడనే ప్రేయసీ' అనుకుంటూ తిరగటానికి భర్తకి ఎలా మనస్కరిస్తుంది? ఎలా

తీరుతుంది? ఆ సంగతి తెలియక తిలకం తన జీవితాన్ని దుర్భరం చేసుకుంటూవుంది. ఎప్పుడూ కిటికీదగ్గర కూర్చోవటం, నీతో గడిపిన క్షణాల్ని స్మృతిపథానికి తెచ్చుకోవటం, నిట్టూర్పులు విడవటం! ఏం చెయ్యాలా అని నేను చాలా ఆలోచించాను. తిలకం అంటే నాకు చాలా ప్రేమ. ఆమె కష్టపట్టం చూచి సహించలేను. అందుకని నీ దగ్గరకు వచ్చి నీ సహాయం తీసుకుందామనుకున్నాను. అదృష్టవశాత్తూ నువ్వే వచ్చావు." అని నవ్వటం మొదలుపెట్టాడు వెంకయ్య.

శిశిరకుమారబాబు మాట్లాడకుండా వింటున్నాడు. వెంకయ్య నవ్వు అతని హృదయాన్ని దహించి వేస్తూవుంది.

వెంకయ్య అందుకున్నాడు:—"ఈ నాలుగు రోజుల పరిచయంతో ఆమెకైపు దిగిపోయివుంటుంది. నువ్వెంత సామాన్య మానవుడవో, దుర్భరపురుషుడవో, నీ కవిత్వం ఎంత పనికిమాలిందో ఆమెకు తెలిసివుంటుంది. నీ పద్యాలకంటే నే ఫ్యాక్టరీలో రాసే ఎకౌంట్లే వుపయోగకరమైనవని తెలిసుంటుంది. నువ్వు పాడే పాటలకంటే నేను వాగే నినాదాలే వుపయోగకరములని తెలుసుకుని వుంటుంది. పైత్యంతో ఎక్కువ కాలం ప్రజల్ని మోసం చెయ్యలేం! అందుకనే నిన్ను నాలుగు రోజులుండమని కోరాను. నిన్ను అర్థంచేసుకునే అవకాశం ఇవ్వటానికి నే నింట్లో లేకుండా వెళ్ళాను. నువ్వు రాగానే వెళ్తే ఏమయ్యేదో తెలుసా! ఆమె నిట్టూర్పులు మరీ ఎక్కువయ్యేవి. ఆమె జీవితం

నాశనమయ్యేది. ఇక భయంలేదు. ఇక నీ అవసరం లేదు. నువ్వెళ్ళొచ్చు" అని లోపలికి సంతోషంగా గెంతాడు.

శిశిరకుమారబాబుకి కోపం వచ్చింది. వెంకయ్య తన్నీ నీచకార్యానికి వుపయోగించుకున్నందుకు రోషం వచ్చింది. భార్యాభర్తల తగాదా తీర్చటానికి తా నీవిధంగా వాడుకోబడతానని అతడు కల్లోకూడా అనుకోలేదు. అది అతనిసిద్ధాంతానికివ్యతిరేకంకూడా! తనసిద్ధాంతంఈవూళ్ళో ఈ ఫ్యాక్టరి పొగలో భగ్నమయిందని వుక్రోషం వచ్చింది. తిలకంతో చెప్పాలని గబగబా లోపలకు వెళ్ళాడు.

కాని తిలకం గదికి వెళ్ళేదార్లో వెంకయ్య కనిపించాడు. "ఎక్కడికి?" అనిఅడిగాడు. "తిలకంతోమాట్లాడాలి"

వెంకయ్య ఈమాటకు బిగ్గరగా నవ్వాడు—"ఆశకు అంతులేదు భాయిసాబ్! తిలకంతో నేమాట్లాడతాను. జరిగిన సంగతంతా చెబుతాను. మీరు వెళ్ళండి. వెళ్ళి కవి సమ్మేళనాలు చేయించండి." అన్నాడు.

శిశిరకుమారబాబు కోపంతో తుకతుకలాడి పోయాడు. కాని వెంకయ్యవైఖరి చూస్తే భయంవేసింది! పట్టుబడితే, ఇంకొక మాటంటే తంతా డనుకున్నాడు. "ప్రపంచ కార్మికులారా, ఏకముగండు" అని మీదకు దూకుతా డనుకున్నాడు.

"ఎక్స్ప్లాయిటేషన్ — ఎక్స్ప్లాయిటేషన్" అనుకుంటూ వచ్చిందారి పట్టాడు.

—o:o—

# ఆకారాలు

ఆ కటికచీకట్లో వూరికి దూరంగా వొంటరిగావున్న ఆ మేడ కేపిటలిస్టు దేశాలమధ్యవున్న రష్యాలా వుంది.

అంతవరకే పోలిక!

మొండి గోడలూ-గజిబిజిగా పెరిగిన వృక్షాలతో ఆవరణా-నరాలు జివ్వున లాగే నిశ్శబ్దం — చీకటిపడితే ఆ చాయలకు ఎవ్వరూ పోరు. అటువంటిచోట, ఆ సమయంలో ఆకుల గలగలధ్వని.

ఎండిపోయిన ఆకులు పాదాలకింద నలుగుతున్న-అప్పడాలు విరుగుతున్న ధ్వని.

బేటరీలైట్ వెల్తురు, అలా వొక్క క్షణం నలుదిక్కులా తిరిగింది. వెలిగింది వెలిగినట్లే మూసుకుంది—

మనుష్యుల ఆకారాలు గోడల అంచున కదులుతున్నయ్. అందులో వొక ఆకారం సర్కిల్ది. మిగిలినవి పోలీసులవి.

ఆ ఆకారాలు అడుగుల్లో అడుగు వేసుకుంటూ గవాక్షాన్ని సమీపించినై. ఇక్కడ గవాక్షం అంటే రెండు అర్థాల్లేక తలుపే గనుక, సర్కిల్ ఆకారం నెమ్మదిగా బహు చాకచక్యంగా తలుపుదగ్గర చెవి పెట్టి వింది. ఏమీ వినపడ లేదు. ఈసారి చెవుల్ని కొంచం దూరంగాపెట్టి వింది. లోపలనుంచి గుసగుసలు వినిపించినై.

పెద్ద ఆకారాన్ని చూచి మిగిలిన చిన్న ఆకారాలు

(హోదాలో సుమండీ) చెవులు రిక్కించినయ్. అది చూచి పెద్ద ఆకారం ముక్కుమీద వేలువేసుకొని వారించింది.

ఈసారి చెవుల గొడవ లేకుండానే లోపలనుంచి, అటూ ఇటూ గాభరాగా తిరుగుతున్న పాదాల ధ్వని—చప్పుడు—వినిపించింది.

సర్కిల్ ఆకారం ఆపులేకపోయింది. "తలుపు" అని గద్దించింది. వెంటనే ఆకారాలన్నీ రిక్కించటం మానేసి "తలుపు" అని గద్దించినయ్.

తలుపు నెమ్మదిగా తెరుచుకుంటూ వుంది. లోపలి వెల్తురు తలుపు సందుల్లోంచి ప్రసరించి ఈ ఆకారాలను మానవుల్నిగా మార్చింది. 'రెడీ' అన్నాడు సర్కిల్.

తెరుచుకునే తలుపు మూసుకుపోయింది. అంతా వొక్కసారి కట్టకట్టుకొని తలుపుమీదపడ్డారు. అవి బార్లగా విడిపోయినయ్, పోలీసులంతా గజిబిజిగా గది ప్రవేశించారు.

ఆహా! అయ్యో!!

ఒకమూల వార్తాపత్రికల కట్టలూ—ఒక మూల పుస్తకాల దొంతర్లూ—ఒకపక్క చీట్లపేక ముక్కలూ—ఒకపక్క సిగిరెట్ పీకెలూ-ఇవీ ఆగది రూపరేఖావిలాసాలు.

సర్కిల్ లోపలగదిలోకి వెళ్ళే ద్వారం మూసి వుంటం చూశాడు. తలుపుతీసిన కుర్రవాణ్ణిచూచి, "పాతాళ హోమం?" అన్నాడు.

"కాదు పిశాచనృత్యం" అని జవాబు.

పోలీసులు హఠాత్తుగా తలుపు తెరచి పిస్తోళ్ళు

చేతుల్లో పట్టుకొని—అంతకుముందు కాళ్ళతో పట్టుకున్నారని కాదు—రెండో గదిమధ్యకు దూకారు. గ్రుననమడంమీద తిరిగారు.

"హాన్డ్స్ అప్" అని గర్జించాడు సర్కిల్.

అదొక గది అని రాశాను. అంతకంటే మరోమాట దొరక్క రాశాను. కాని అది గదే! మధ్య వొక డ్రాయరుంది. దానిమీద వెలుగుతూ వెలగని దీపం. దానిప్రక్కన గ్లోబ్. ఒకమూల కుర్రవాడు కూచున్నాడు. అతడుమాత్రం పోలీసుల ప్రవేశానికి ముందునుంచీ చేతులు పైకెత్తుకునే కూర్చున్నాడు. మరోమూల మరో కుర్రవాడు-అతనిచేతులు మాత్రం దించుకునే వున్నయ్. దించుకునేవున్న చేతుల్తో కంగారుగా చేతిలోని వస్తువు కాగితం కిందకు తోశాడు.

పోలీసులు కాలాంతకులు. ఆవులించి పేగుల్లెక్క పెడతారు. ప్రస్తుతం ఆ కుర్రవాని చేతినరాల్లెక్క పెట్టారు. "హాన్డ్స్ అప్" అని అరిచాడు సర్కిల్. ఆ కుర్రవాడు కూడా కిక్కురుమనకుండా చేతులు పైకెత్తాడు. నోట్లో సిగరెట్‌పీకమాత్రం అలానేవుంది. దమ్ములాగుతూనే వున్నాడు. పొగ వదుల్తూనే వున్నాడు. "ఆ కాగితం కింద ఏం పెట్టావ్?" అడిగాడు సర్కిల్.

కుర్రవాడు పొగతో జవాబు చెప్పాడు. "చేతులు పెట్టి కాల్చుకున్నా" మరో దమ్ములాగి, "చేతులు దింపనివ్వండి తీసి చూపిస్తాను" అన్నాడు.

ఒక పోలీసుసర్కిల్ చెవిలో భయం వూదాడు.

ముందుకు అడుగువేసిన సర్కిల్ ఆగిపోయి, పోలీసులను ఆజ్ఞాపించాడు—"ఆ కాగితం కింద ఏమిటో చూడండి."

వాళ్ళదరిపోయారు—పాపం! వాళ్ళవీ ప్రాణాలే! వాళ్ళవీ పోలీసు హృదయాలేగద! కాని అందులో వొక డికి ప్రాణంకంటే పొట్టతీపు. వాడు వొణుకుతూ వీలయినంత దూరంగా వుండి, కాగితం కొన పట్టుగొని పైకెత్తాడు.

"అమ్మో!" అని కేకవేసి కళ్ళు మూసుకుని చతికిల బడ్డాడు—కూర్చున్నవాణ్ణి కుక్కకూడా కరవదు. ఇక బాంబెందుకు పేలుతుంది?

సర్కిల్ కాగితంకిందవున్న పొట్లాంచూచి గజగజ లాడాడు. సూటిగా గుండెమీదే పేలిందనుకున్నాడు.

తీరా అందరూ కళ్ళుపెట్టుకుని చూచేటప్పటికి అది పంచదార బిళ్ళల పొట్లాం అయింది.

సర్కిల్‌కి కోపం వచ్చింది. "ఈ ఇల్లంతా సోదా చెయ్యాలి" అన్నాడు.

"సోదా చేస్తే మీ కవమానం. చెయ్యకపోతే మా కవమానం. అలాగే చెయ్యాలి" అన్నాడు మొదట్నుంచీ చేతులు పైకెత్తుకున్నచున్న కుర్రవాడు.

సర్కిల్ వెంటనే ఆజ్ఞాపించాడు. ఒక పోలీసు కుర్ర వాళ్ళని సోదా చేశాడు—ఒకరి జేబులో వార్తాపత్రికల కటింగులు దొరికాయి. ఒకరి జేబులో నిప్పుల పుల్లలూ చిల్లా:: దొరికాయి. మరొకరి జేబులో థర్మామీటర్ దొరికింది.

ఈలోగా సర్కిల్ ఊరుకుంటాడా? గదంతా వెతికి అలమర తెరిచాడు. అందులో మూలగా కనబడీ కనబడకుండా, ఒకసీసావుంది. దాన్నిండా ఏదో ద్రావకం.

"ఇదేమిటి?" సర్కిల్ జబర్దస్తీగా కుర్రవాళ్ళని అడిగాడు. సిగరెట్ తాగే కుర్రవాడు చెప్పాడు—"సీసా"

"లోపలి?"—

"ద్రావకం"

"ఏం ద్రావకం?" మీాదకు మీాదకు వెల్తూ రౌద్రంగా అడిగాడు! కుర్రవాళ్ళు బెదిరారు. వొకరిమొహాలు వొకరు చూచుకున్నారు—"చెప్పండి" గద్దించాడు సర్కిల్.

తలుపుతీసిన కుర్రవాడు చెప్పాడు. "మాకేం తెలుస్తుంది! మేమేం డాక్టర్లమా?"

"అదే తెలుస్తుంది. ఇప్పుడు తెలియదు. రేపు తెలుస్తుంది. కపడ్దార్ ...." అన్నాడు గడ్డాంపోలీసు.

సర్కిల్ సీసాను గుడ్డకు చుట్టి భద్రంగా జేబులో పెట్టుకున్నాడు. ఇంతలో పోలీసులు రెండు ఎర్ర అట్టల పుస్తకాలు పట్టుకొచ్చారు. అవన్నీ తీసుకొని కోరచూపులు చూస్తూ పోలీసులు నిష్క్రమించారు. ఈ మానవులు మళ్ళీ గదిలోనుంచి బయటకు అడుగుపెట్టగానే ఆకారాలుగా తయారయ్యారు.

కుర్రవాళ్ళంతా విరగబడి నవ్వుతున్నారు చేతులు పైకెత్తుకొని కూర్చున్న కుర్రవాడు (ఇప్పుడు దించేశాడు) తలుపుతీసిన కుర్రవాణ్ణి చూచి, "మళ్ళీ డబ్బొచ్చేదాకా నీకు కాడ్లివర్ ఆయిల్ లేదు" అన్నాడు.

"మళ్ళీ డబ్బొచ్చేదాకా నాకు గుండెజబ్బా వుండదు—" అన్నాడు ఆ కుర్రవాడు.

నవ్వుకున్నారు.

వెంటనే గ్లోబ్ చుట్టూ మూగారు. వెంటనే బాహ్య ప్రపంచాన్ని మరిచిపోయి తర్కంలో పడ్డారు—రష్యా—మధ్యధరా సముద్రం—ఇటలీ—జర్మనీ—యూరప్‌లో సెకండ్ ఫ్రంట్—ఇండియా—ప్రజాయుద్ధం.

———

# పిరికివాడు

తన దేశంమీదకు పరదేశం దండెత్తి నెమ్మదిగా ఆక్రమించుకుంటున్నదని వినగానే, పిరికివాడు రెండురకాల జండాలు తయారుచేసుకొని కూచున్నాడు-ఒకటి స్వదేశం జండా, ఒకటి దండెత్తి వచ్చిన పరదేశం జండా.

'స్వదేశం గెలిస్తే ఈ జెండా. పరదేశం గెలిస్తే ఈ జెండా' అని మనస్సులో అనుకొని, గదిలో ఒకమూల పెట్టాడు. ఇక ఏ దేశం గెలిచినా తనకేమీ పరవాలేదను కున్నాడు. 'స్వదేశం గెలిస్తే స్వదేశం జెండా వుండనే వుంది. పరదేశం గెలిస్తే పరదేశం జెండా వుండనే వుంది. ఇక నాకేం?' అనుకున్నాడు. పరదేశ సైన్యాధ్యక్షుడిమీద, 'నీకు దీర్ఘాయురస్తు' అని కొన్ని సీసపద్యాలు రాసి తయారుగా వుంచుకొన్నాడు కూడాను.

అసలు పిరికివాడికి రెండు దేశాలు ఎందుకు యుద్ధంలోకి దిగాలో, ఇంతమంది తమ ప్రాణాలను దేశంకోసం ఎందుకు అర్పించాలో అర్థమయ్యేదికాదు. సంకుచితదృష్టీ, మూర్ఖత్వం ఈ రెండే దీనికి కారణమనుకొనుకునేవాడు. తాను ఈ కక్షలకు అతీతుడననీ, తన హృదయం అతి విశాలమనీ అనుకునేవాడు కనుక మూర్ఖులు యుద్ధాలు చేసుకొని రక్తపాతం కలిగించుకునేటప్పుడు తనబోటి విశాల హృదయులు ఏం చెయ్యాలి? తమ సుఖంకోసం తాము పాటుపడాలి. ఆలోచించి పిరికివాడు ఈ నిర్ణయానికొచ్చి దానికోసం పాటుపట్టం మొదలుపెట్టాడు.

కాని యుద్ధం తీవ్రరూపం దాల్చిందగ్గరనుంచీ పిరికి వాడు తను తలపెట్టిన కార్యం అనుకున్నంత తేలిక కాదని గ్రహించాడు. ఏదేశం గెలుస్తుందో ముందే ఎలా తేల్చుకోవటం?

రాత్రంతా ఆలోచించి ఇక స్వదేశం గెలవదుగనుక పరదేశం జెండాపట్టుకొని బయలేరదామని నిశ్చయించుకొని తెల్లవారి లేచేటప్పటికి "స్వదేశం సేనలు కొన్ని కొన్ని రంగాల్లో గెలిచాయి" అని పెద్దపెద్ద అక్షరాల్తో వార్తాపత్రికలు ప్రచురిస్తూ వుండేవి. స్వదేశజెండా పట్టుకుని బయలేరదామనుకున్నరోజు, "విదేశసేనలు స్వదేశసేనలనుతరిమివేశాయి" అని వార్తలు వస్తుండేవి!

పిరికివాడికి ఏమీ తోచక, ఏజెండా పట్టుకుని వూరేగాలో తేముల్చుకోలేక హైరానయిపోయాడు. రెండుజెండాలకూ ఎదురుగా ఎప్పుడూ ఆగదిలోనే కూర్చునేవాడు. తానురాసిన పద్యాలు మోకాలుమీద కూర్చుని రిహార్సలు వేసుకునేవాడు. ఒకక్షణం విదేశం జెండా బుజంమీద పెట్టుకొని గదిలో ఇటూఅటూ పచారు జేసేవాడు —ఒకక్షణం స్వదేశంజెండా పట్టుకొని గంతులు వేసేవాడు. రెండూ మూలపెట్టి, ఎదురుగా నిలబడి, "స్వదేశం గెలిస్తే ఈజెండా; విద్దేశం గెలిస్తే ఈజెండా" అని వెర్రిగా అరిచేవాడు.

ఒకరోజు శత్రువు ఆ వూరిమీదకే వస్తున్నాడని, ఏభై మైళ్ళదూరంలో వున్నాడని వదంతులు ప్రబలినై.

సైన్యంలో జేరగా మిగిలి ధైర్యవంతులు వూరు ఖాళీ చెయ్యటం మొదలుపెట్టారు. పిరికివాడికి ఆవేశం ఎక్కింది. ఇన్నాళ్ళనుంచీ తాను వేసుకున్నప్లాను, ఆచరణలో పెట్టి దాని ఫలితాన్ని అనుభవించే గడియ దగ్గర కొచ్చిందను కొన్నాడు. కదలకుండా మెదలకుండా తన గదిలోని జెండా లకు ఎదురుగా బాచీపెట్లు వేసుక్కూచుని "స్వదేశం గెలిస్తే ఈ జెండా" అనుకొని "ఈ జెండే, ఈ జెండే ఇదే జెండా" అనుకుంటూ వెర్రివాడిలా గదంతా చిందులు తొక్కాడు.

ఒక స్నేహితుడు కావలసిన సామానంతా వీపుకు కట్టుకొచ్చి "రావూ?" అని అడిగాడు.

"నేనా? నేనెందుకు రావటం? నేనేం పిరికివాణ్ణా? పిరికి వాళ్ళు పారిపొండి, నేరాను. ఈ జెండా, ఈ జెండా ఈ జెండే" అన్నాడు పిరికివాడు.

బయట ఖాళీచేస్తున్న జనం కోలాహలం పిరికివాడి గదిలోకూడా వినిపిస్తూవుంది. రోడ్లమీద జనం అన్ని దిక్కులకూ తోకలుతెగిన నక్కల్లా పరుగెత్తుతూవుంది. అంతజనంలోనూ బళ్ళూ కార్లూ కళ్ళు మూసుకొని తిరుగు తున్నై. మధ్యమధ్య మిలిటరీ కార్లు గంటలు గణగణ మోగించుకుంటూ రయిన వెళ్తున్నై. దూరాన్నుంచి బాంబులు పేలినధ్వనులు వినిపిస్తున్నై. జనానికి ఏం జెయ్యాలో తెలియక, ఎక్కడికి పారిపోటానికీ తోచక, రోడ్డుకి అడ్డంగా, బయల్దేరిన చోటునుంచి పరుగెత్తిన చోటుకీ, పరుగెత్తిన చోటునుంచి బయల్దేరిన చోటుకి పరి

గెత్తుతూ కార్ల కిందా బళ్ళకిందా పడి నలిగిపోతూ వున్నారు. మనుష్యుల్లోని ఈ చలనమంతా శారీరకమే! బుర్రలు ఆట్టం ఎప్పుడో మానుకున్నై. యుద్ధం రోజుల్లో బళ్ళే మనుష్యులూ—మనుష్యులే బళ్ళూ!

పిరికివాడు గదిలోనుంచి ఇదంతా చూశాడు. పారిపోతున్న జనాన్ని చూచి తనలోతాను నవ్వుకున్నాడు. "పిరికి వెధవలు" అనుకున్నాడు. హఠాత్తుగా పరదేశంజెండా పట్టుకొని. "ఈ జెండా, ఈ జెండా, ఇదే జెండా" అనుకుంటూ బజార్న పడ్డాడు.

జనం అతన్ని మిలిటరీ లారీని చూచినట్లు చూచి రెండుపాయలై దారిచ్చింది. పిరికివాడు ఆమధ్యనుంచి పరదేశంజెండా బుజానపెట్టుకొని "ఇదేజెండా, ఒకటే జెండా, ఒకటే జెండా, ఏకైక జెండా"అని కేకలు పెట్టుకుంటూ పరుగెత్తుతున్నాడు.

జనం విరగబడి తొక్కుకుంటూ ఉందేగాని అతన్ని ఏమీ అనలేదు. గుడ్లువప్పజెప్పి చూస్తూ వూరుకుంది. ఏపని చేస్తున్న మనిషి ఆపనిఆపేసి స్థాణువై నిలబడి చూస్తున్నాడు. బళ్ళూ, కార్లూ ఎక్కడవి అక్కడ ఆగిపోయినై.

"పాపం పిచ్చెత్తింది" అని కొందరు చప్పరించారు. యుద్ధంనుంచి కాళ్ళు విరగ్గొట్టుకొనీ, చేతులు విరగ్గొట్టుకొనీ, మూతులు పగలగొట్టుకొనీ, మెదళ్ళు చిట్లగొట్టుకొనీ పిచ్చెక్కి వికృతాకారాలతో రోడ్లమీద తిరిగేసి మను

ష్యాల్ని ఈమధ్య ఆ వూరి ప్రజలు చాలమందిని చూచి వున్నారు. అందుకనే తేలిగ్గా "పిచ్చెక్కింది" అనే నిర్ణయం......

పిరికివాడు ఆవిధంగా పరుగెత్తి పరుగెత్తి వూరిబయటకు పరుగెత్తాడు. అక్కడ ఒక్క క్షణం నిలబడి బాంబులు పేలుతున్న వైపుకి చూశాడు. దూరంగా చెట్లచాటునుంచీ, గుట్టలచాటునుంచీ తుపాకీలతో బిలబిలా పరుగెత్తుకు వస్తున్న సైన్యాన్ని చూశాడు.

చెయ్యి వొణికింది. భుజంమీద వున్న విదేశజండా రెపరెప కొట్టుకుంది. హృదయం ఆవేశంతో తుకతుక లాడింది. తన శక్తినంతా కేంద్రీకరించుకొని "జై జై ! ఈ జెండాకే జై. ఇదే జెండాకీ జై." అని కేకలు పెట్టుకుంటూ వచ్చే సైన్యానికి ఎదురుగా మళ్ళీ పరుగు లంకించుకున్నాడు. ఒక్కొక్క అడుగు దగ్గరకు వెల్తున్నకొద్దీ గాలే మారిపోతున్నది. కర్ణ రంధ్రాల్ని బద్దలుకొట్టే మోతలు. కళ్ళు తెరవటమే కష్టమయింది. అలాగే పిరికివాడు శరీరాన్ని బిగబట్టి పరిగెత్తాడు. భుజంమీదవున్న జెండా గాలికి గిలగిల కొట్టుకుంటూ వుంది. హఠాత్తుగా పిరికివాడు భూమిలో గుచ్చుకుపోయినట్లు ఆగిపోయాడు.

అంతా నిశ్శబ్దం. బాంబుల మోతలు ఒక్కసారి ఆగిపోయినై. పిరికివాడు నెమ్మదిగా కళ్ళు తెరిచి చూశాడు. శవాలు ! ఎటుచూచినా శవాలే ! తనచుట్టూ శవాలే !! కొంచెం దూరంలో సైన్యం.

ఆ సైన్యం ఇదివరలోలాగా లేదు. అంతా కలిసి ఉవ్వొంగిన హృదయంలాగా, పొంగిన సముద్రంలాగా వొస్తూవుంది. ఆ సైన్యానికి ముందు నడుస్తున్న వ్యక్తిని చూశాడు పిరికివాడు. అతని చేతిలోనూ జెండా వుంది. అదీ రెపరెప గిలగిల లాడుతూవుంది. "జై. జై. ఈ జెండాకీ జై. ఇదే జెండాకీ జై. పరదేశ జెండాకీ జై." అని అరిచాడు పిరికివాడు. కాని ఇదేమిటి ? అదేం జెండా ?

దిమ్మతిరిగి కళ్ళు బయర్లుకమ్మి పిరికివాడిచూపు సరిగ్గా ఆనటంలేదు. సైన్యం అలికిన గోడలా కనిపించింది. వాళ్ళ చేతుల్లోని తుపాకులు నెమలి పింఛాల్లా విప్పుకుంటు న్నట్లు కనిపించాయి. జెండా పట్టుకున్నవ్యక్తి తోలు బొమ్మలా, రెల్లుదుబ్బులా కనిపించాడు. అతని చేతుల్లోని జెండా స్వదేశం జెండా !

కాని పిరికివాడు నమ్మలేకపోయాడు. కళ్ళు తుడుచు కొని చూట్టానికి తన చేతులో జెండా వుండె. మళ్ళీ సైన్యాన్ని చూశాడు. స్వదేశసైనికుల్లా కనిపించారు.

ఏమిటిది ? అతని గుండెలు పగిలినై. అది స్వదేశం జెండాయే ! అది స్వదేశ సైన్యమే !! తాను పొరపాటు బడ్డాడు. ఈ సంగతి ఆకలింపుకు రాగానే తన గదిలోవున్న స్వదేశంజెండా జ్ఞప్తికి వచ్చింది. కెవ్వున కేకవేసి గిరున తిరిగి తన ఇంటికి, స్వదేశంజెండా కోసం పరుగు లంకించు కున్నాడు.

ఢాం.... ఢాం.

పరుగెత్తే పిరికివాడి గుండెల్లోకి ఒకేసారి రెండు గుళ్ళు జొరబడ్డాయి. ఒకటి సైన్యంలోనుంచీ, ఒకటి చెట్టు చాటునుంచీ వచ్చినై. ఒకటి వీపులోనుంచీ, ఒకటి రొమ్ములోనుంచీ గుండెల్లోదూరి కలుసుకున్నై. ఆ విశాల హృదయంలో స్వదేశ విదేశ నాగరికతల సమ్మేళన ఈ విధంగా జరిగింది.

"అమ్మో!" అనే భయంకర ఆర్తనాదమే ఈ సమ్మేళన ఫలితం.

పిరికివాడు ఆ రెండు గుండుదెబ్బల్తో కిందపడి, ఉంగలుపడి, చాపలా చుట్టుకుపోయి, తల రొమ్ములోకి దూర్చుకొని, ప్రాణాలు వొదిలాడు. ప్రాణాలు పోయే ముందుమాత్రం పెదవులు కదలినై—"స్వదేశం గెలిస్తే ఈ జెండా, పరదేశం గెలిస్తే ఈ జెండా!"



"కూలీ?" అని పిలిచాడు.

"బాబూ"

"పెట్టె తీసుకురా"

"ఎక్కడకు బాబూ?"

పేట పేరు చెప్పాడు గోపీ.

"అణా బాబూ"

"బేడ ఇస్తా, నాతో రా."

పెట్టె కూలివాడి నెత్తిమీద పెట్టి పరధ్యానంగా బయల్దేరాడు గోపి. కూలీ గోపీవెనక అడుగుల్లో అడుగులు వేసుకుంటూ వెళ్తున్నాడు.

వర్షం కురవటానికి ప్రయత్నిస్తూ వుంది. సూర్యుడు నాశనమైన చీకట్లో నక్షత్రాలు మెరుస్తున్నాయి. గోపీ కూలీపిల్లవాడితో సంభాషణ మొదలు పెట్టాడు:

"రోజుకి ఎంతొస్తుందిరా?"

"అర్ధణో, అణో వస్తుందండి!"

"దాన్తో ఏం చేస్తావ్?"

"కొనుక్కు తింటాను."

"ఇంటిదగ్గర ఇవ్వవూ?"

"నాకు అమ్మా బాబూ లేరండి! ఉంటే అట్లాగే ఇచ్చేవాణ్ణి."

"మరి నీకు పొట్ట ఎలాగురా గడవటం?"

"ఇక్కడ ఒకపోర్టరుకాడ వుంటున్నానండీ. ఆయన ఇంట్లో పనిచేసిపెడతాను. అన్నం పెడతారు. రైలొచ్చినప్పుడు ఇట్లా కూలి మోస్తుంటాను. ఏ అణో వాస్తే కొనుక్కు తింటాను. రాత్రిపూట రైలుస్టేషన్లో పడుకుంటానండీ..."

"ఎంత హాయిబ్రతుకురా" అనుకున్నాడు గోపీ. కాని అప్పట్నుంచీ ఆ పిల్లవాణ్ణి చూస్తే గోపీకి భయం.



## ఇలా జరిగేను!

అది రెండో సంవత్సరం—

గత సంవత్సరమంతా యశోధరుడు ఆ పల్లెలోనే వుండి పార్టీ పనిచేశాడు. రాత్రింబగళ్ళు నిద్రా నీళ్ళూ లేకుండా పనిచేశాడు. వ్యవసాయకూలీలనుగురించే బండెడు పుస్తకాలు చదివాడు. వాళ్ళల్లో చైతన్యరహితంగా పడివున్న శక్తిని గ్రహించాడు. వాళ్ల హక్కులను తెలుసుకున్నాడు. రైతులు వాళ్ళ నేవిధంగా పీడిస్తూవుందీ—అతని భాషలో రక్తం తాగటం—అర్థం చేసుకున్నాడు. ఇవన్నీ వాళ్ళకి చెప్పాడు.

"పని చేసేది మీరు; ఫలితం అనుభవించేది వారు" అన్నాడు.

ఎవరా అని వ్యయసాయ కూలీలు అటూ ఇటూ చూశారు.

"రోజుకి గుప్పెడు మెతుకుల్లేకుండా మీరెంతకాలం ఇలా బ్రతుకుతారు?" అని ప్రశ్నించాడు. వ్యవసాయ కూలీలు తమ తమ కుండలు సర్దుకున్నారు, ఆరబోసిన బెత్తల్ని, కుప్పలు కుప్పలుగా వున్న పీతల్ని, వేలాడకట్టి వున్న చీకుల్ని చూచుకొని గుటకలు మింగారు.

"మీ శక్తి మీకు తెలియదు. మీరు ఏకంగా ఒక్క పెట్టున లేస్తే రాజ్యాలే మీ చేతుల్లోకి వస్తయ్" అన్నాడు యశోధరుడు.

వాళ్ళు ఒకళ్ల చేతులుఒకళ్ళు చూచుకున్నారు. ఎవరి చేతులు వాళ్లు దులుపుకున్నారు.

ఈవిధంగా అతడు సంవత్సరం తంటాలుపడ్డాడు. సంవత్సరం తిరిగివచ్చేటప్పటికి అతని కృషికి ఫలితాలు గోచరించినయ్. వ్యవసాయ కూలీల్లో విప్లవచిహ్నాలు కేకెత్తినయ్. ఎక్కడ చూచినా, కూలీలందరూ 'ఏకము కావలెరా' అనే కీర్తనే వినబడుతూ వుంది—ప్రతిదానికి యశోధరుని సలహా తీసుకోవటం. మొదలుపెట్టారు. క్షణ క్షణానికీ పల్లెఅంతా మారిపోతున్నట్లు ఊహించుకున్నాడు. తనకృషి నేటికి ఫలించిందికదా అని సంతోషించాడుయశోధరుడు. ఈ వేడిలోనే జయం పొందాలనుకున్నాడు. వ్యవసాయకూలీలు 'స్సై' అన్నారు.

"పదండి పోదాం, పదండి ముందుకు" అన్నాడు వెంకయ్య. పల్లె పల్లె బిలబిలా బయల్దేరింది. పిల్లలు పెద్దలు అంతా బయల్దేరారు. షాహుకారు బసవయ్య ఇల్లు చుట్టు ముట్టారు.

షాహుకారు బసవయ్య—వెంకాయికి, ఆ వూళ్లో రైతులందర్లోకీ డబ్బున్నవాడు. ఆ ఇంటి దగ్గరకు జేరినప్పటి నుంచీ, మిగిలినవాళ్లు కేకలు వేస్తున్నా వెంకయ్య కొంచెం బెరుగ్గా వుంటం మొదలుపెట్టాడు.

"తలుపు తలుపు" అని కేక వేసింది జనం!

కాని తలుపు అలాగే మూసుకొనివుంది. వ్యవసాయ కూలీలకు ఏం చెయ్యటానికీ తోచలేదు. అయిదు నిముషా

లయింది-పది నిమిషాలయింది - పావుగంట అయింది. తలుపు అలాగే వుంది. వ్యవసాయ కూలీలు ముగ్గురు నలుగురు చొప్పున ఒక్కొక్కచోట జేరి కబుర్లు చెప్పుకోవటం మొదలు పెట్టారు. యశోధరుడికి చిరాకు వేసింది. ఉపన్యాసం మొదలుపెట్టాడు.

"కామ్రేడ్స్!"—

ఇంతలో తలుపు తెరుచుకుంది. బసవయ్యా బయటకు వచ్చాడు. అతని వేలు పట్టుకొని మూడేళ్ళకూతురొచ్చింది. భార్య అన్నపూర్ణ తలుపుపక్కనుంచి తొంగిచూస్తూవుంది.

ఉపన్యాసకుణ్ణి వొదిలి వ్యవసాయ కూలీలంతా వొక్కసారి బసవయ్యవేపుకితిరిగారు. కూర్చున్నవాళ్ళంతా వొక్కసారి లేచి నిలబడ్డారు. తరువాత ఏం చెయ్యాలో తోచలేదు. అలాగే చూస్తూ నుంచున్నారు.

బసవయ్యా మూడేళ్లకూతురు గుంపులోవున్న వెంకాయిని గుర్తుపట్టింది. సంతోషంగా "అలుగో, ఎంకు, ఎంకు, ఎంకు." అని బుల్లిచేతుల్తో చప్పట్లు కొడుతూ గంతులేసింది.

వెంకాయి సిగ్గుతో తలవంచుకొని, "మా చిన్న దొరసాని, మా చిన్నదొరసాని" అని పక్కనున్న వాళ్ళకి చెప్పాడు.

"వెంకా" అని పిలిచాడు బసవయ్యా.

"వెంకాయి వులిక్కిపడ్డాడు. "వెళ్లరా, పెద్దదొర పిలుస్తున్నాడు." అని అంతా వెంకాయిని ముందుకు నెట్టారు.

"ఏరా ఎంకా బాగున్నావా?" అన్నాడుబసవయ్యా.

ఆ మాటలు వెంకాయి హృదయాన్ని కరిగించినయ్. ఎన్నడో విడిచిన తండ్రిని చూచినట్లు ఆనందించాడు. ముసిముసినవ్వులు నవ్వుకుంటూ నిలబడ్డాడు.

"ఎందుకురా, ఇంతమందొచ్చారు? ఏమన్నా పనుందా!" అని అడిగాడు బసవయ్య.

"ఏం లేద్దొరా!" అని సణిగాడు వెంకాయి.

"చెప్పు దొరతో చెప్పుకోరా. మనవిచేసుకోరా". అని కొంతమంది కేకలు వేశారు.

వెంకాయి, తప్పక ధైర్యం చేశాడు-"ఏం లేద్దొరా! మాకొకటి కావాలి."

"ఏమిటి చెప్పు?"

"నూతన వెవస్థ"

"ఏమిటి?"

"నూతన వెవస్థ దొరా"

బసవయ్య కొంచెంసేపు ఆలోచించాడు. కాని అర్థం కాలేదు-"అది నాదగ్గర లేదు" అన్నాడు.

"చూడు దొరా" అని ప్రాధేయపట్టానికి రెండడుగులు ముందుకు వేశాడు వెంకాయి.

"దగ్గరలేదురా, పోయి మన జమీందారు దగ్గరుందేమో అడుగు" అన్నాడు బసవయ్య.

"అవును ఆయనదగ్గరే దొరుకుతుంది. అక్కడే దొరుకుద్ది" అని మిగిలినవాళ్లు కేకలు వేశారు. యశోధరుడు ఉక్కిరిబిక్కిరై పోయాడు. ఏం చెయ్యాలో బోధపడలేదు.

ఎలా జోక్యం కలిగించుకోవాలో తెలియలేదు. జోక్యం కలిగించుకుంటే ముందీ వ్యవసాయకూలీలు వూరుకుంటారా? అనే స్థితి కొచ్చింది.

వెంకాయి మళ్ళీ బసవయ్య నడిగాడు - "ఇంకొకటి దొరా!"

"ఏమిటి?"

"కూలీలంతా ఏకం కావాలి దొరా!"

"ఎందుకు?"

"కావాలి దొరా!"

"ఎందుకురా, కారణం చెప్పు?"

"కారణం ఏంటి దొరా! ఏకం కావాలి?"

"సరే అవ్వండి."

"అదేంటి దొరా, అలా సెలవిస్తావ్? దొరసాయం లేకుండా మేం ఎట్లా ఏకం అవుతాం?"

"సరే అట్లాగే అవ్వుదురుగాని, . మరి మమ్మేల్నేం చెయ్యమంటావు?" అన్నాడు బసవయ్య.

"మీరా.... దొరలా.... దొరలా...." అంటూ నసికాడు వెంకాయి.

"నిజమేరా, దొరల్నిడిచి మనంఎక్కడికి పోతాం-" అన్నారు కొందరు.

"నువ్వడిగింది బాగుంది దొరా!" అన్నాడు వెంకాయి.

"అందుకని మనం అంతా ఏక మవుదాం." అన్నాడొక వ్యవసాయ కూలీ.

"ఏకమవుదాం, ఏకమవుదాం!" అని మిగిలిన కూలీల్లోంచి కేకలు. వెంకాయి సంతోషం చెప్పటానికి వీల్లేదు. అమాంతంగా బసవయ్య మూడేళ్ల కూతుర్ని ఎత్తుకొని—

"మా చిన్న దొరసాని
మా చిట్టి గొరసాని
మా బుల్లి దొరసాని
ఏకమవుదాం
ఏకమవుదాం
ఏకమవుదాం—" గంతులేశాడు.

"అంతా జమీందారు మీదకు పోదాం. నూతన వెవస్త తెచ్చుకుందాం. దొరలుంటే మనకేం భయం" అని వ్యవసాయకూలీలంతా కేకలు!

"ఇక మీ పనుల్లోకి మీరు పొండి" అన్నాడు బసవయ్య. వెంకాయ తప్ప అంతా సంతోషంగా గుసగుసలాడుకుంటూ వెళ్ళారు.

"దొరంటే పెద్దదొరని చెప్పుకోవాల" అన్నాడొకడు.

"కష్టసుఖాలు తెలిసిన మారాజు" అన్నాడు మరొకడు.

"అడిగినవన్నీ వొప్పుకున్నాడురా" అన్నాడు మరొకడు.

అన్నపూర్ణమ్మ అప్పుడు బయటకువచ్చి, "వెంకా! వెళ్ళి ముందు గేదెముందు ఇంత గడ్డివేసి పో! మజ్జిగ వున్నయ్ పోయించుకుపో" అంది.

"అట్లాగే దొరసానమ్మా" అని దొడ్లోకి పరుగెత్తాడు వెంకాయి.

వెంకాయిని చూచి గేదె 'ఛే' అని అడలింది.

యశోధరుడు ఒక్క క్షణం తన్ను తాను నమ్మలేకుండా అలాగే నిలబడిపోయాడు. శూన్యం-శూన్యం-శూన్యం-జేబులో నుంచి అచ్చుపుస్తకం తీశాడు. గబగబా పేజీలు తిరగవేశాడు. అప్రయత్నంగా ఈ వాక్యం అతని కంట బడింది. "ప్రజాస్వామిక విప్లవంలో వ్యవసాయకూలీలూ, రైతులూ కలిసి పోట్లాడాలి."

"ఇది ప్రజాస్వామిక విప్లవమా?" అనుకున్నాడు. అటూ ఇటూ చూశాడు. కాని అప్పటికే ఎవ్వరిదారిన వాళ్ళు వెళ్ళారు. వ్యవసాయకూలీలూ ఎవ్వరి పనుల్లోకి వాళ్ళు వెళ్ళారు. బసవయ్య భార్యనీ కూతుర్నీ తీసుకొని ఇంట్లోకి వెళ్ళి తలుపులు వేసుకున్నాడు.

యశోధరుడికి మిగిలింది శూన్యమే!

# బీదవాళ్ళంతా ఒకటి

తుపాకి గుళ్ళమోత... ఢాం, ఢాం, ఢాం. కేకలూ బొబ్బలూ, ఏడ్పులూ.

మంచంమీద పడుకొనివున్న పోలీసు రామయ్య, ఎక్కడా అని గాభారాపడుతూ లేచాడు. ఎక్కడో కాదు, తన డొక్కలో - కాదు. కాదు, తనగుండెల్లో - కాదు, కాదు తనతలలో - ఆ తుపాకీ గుళ్ళమోతా, ఆ కేకలూ, ఆ బొబ్బలూ-ఆ ఏడ్పులూ అన్నీ తనలోనే!

తల అదిరిపోతూవుంది. గుండెలు పగిలిపోతున్నాయ్. డొక్కలు ముక్కలౌతున్నాయ్. పిచ్చెక్కటంమాత్రం తప్పదు.

మొన్న ఫ్యాక్టరీముందు పికెటింగు చేస్తున్న కార్మికులమీద తాను తుపాకి పేల్చాడు, తన కళ్ళముందే పది నిండు ప్రాణాలు పోయినై. అంతకుముందు వారు అతి వుత్సాహంగా వున్నారు. ఇటూ అటూ కేకలు వేస్తూ తిరుగుతున్నారు. తనూ వాళ్ళతో ఏదో గుసగుసలాడుతున్నారు. ఫ్యాక్టరీ యజమానులతో పోట్లాడుతున్నారు. తను తుపాకీ పేల్చాడో లేదో, చటుక్కున చాప చుట్టలకు మల్లే పడిపోయారు.

ఏమినెత్తురు! కళ్ళు బయర్లు కమ్ముకు పోతేను! ఆ శవాలను చూస్తుంటే తన శరీరం గగుర్పొడిచింది. అస

హ్యాంవేసింది. కంపరం పుట్టింది. ఆ నెత్తురు తన నోట్లోకి వొచ్చిపడుతున్నట్టు అనిపించి కడుపులో తిప్పింది.

అ చచ్చిపోయినవాళ్లల్లో ఇద్దరు ఆడంగులున్నారు. వాళ్ళని తను ఎరుగును. అప్పుడప్పుడూ కూరగాయల మార్కెట్లో కనిపిస్తూ వుండేవాళ్ళు. తను చూస్తే ఎంత భయపడేవాళ్లు! గజగజ వొణికిపొయ్యేవాళ్ళు. తాను అడిగిన కూరలన్నీ ఇచ్చి బిక్క-మొహం వేసుకూర్చునే వాళ్లు. తాను డబ్బిస్తే ఇచ్చినట్టు లేకపోతే లేదు.

అటువంటివాళ్లకి ఇప్పుడీ ధైర్యం ఎక్కడనుంచి వొచ్చిందో! తన తుపాకికి ఎదురుగా నిలబడ్డారు. ఎన్ని చెప్పినా వెళ్లరే! పైగా "నువ్వు న్యాయం అనుకుంటే చంపు రామయ్యన్నా!" అన్నారు. తనకు నిజంగా జాలి కలిగింది. కాని ఏంచేస్తాడు? 'ఫైర్' అన్నాడు సూపరింటెండెంటు. తాను తుపాకీ పేల్చాడు. పాపం, ఆ రెండో అమ్మాయి పాపం తుపాకీ దెబ్బ తగలగానే ఎట్లా అరిచింది! అబ్బబ్బ.... తనగుండెల మురిగిపోయినై. ఆ కుర్రవాడు మాత్రం సామాన్యం అయినపని చేశాడా! ఎదురుగావొచ్చి రొమ్ము ఇచ్చి, కార్మికుల రక్తం నీకంత రుచిగావుంటే తాగు" అన్నాడు.

నిజంగా ఆ క్షణం తనకి చేతులువొణికినై. ఆ కుర్ర వాని కళ్లల్లో ఎంత ఏహ్యాభావం కనిపించింది! తనమీద తనకే అసహ్యం కలిగింది. తాను మనిషికాదు - క్రిముల్లో క్రిమి అనిపించింది. తుపాకీ కాల్చాడు.

ఆ కుర్రవాడు, నుంచున్నవాడు నుంచున్న పళంగా నేలకు వొరిగాడు. అతని కళ్లు మాత్రం ఇంకా తనవైపుకే చూస్తున్నాయి, బతికివున్నప్పుడు చూసినట్టే! ఆ చూపులు తేళ్ళయి, జెర్లయి తనవొళ్ళంతా పాకినై - గిరుక్కున మొహం తిప్పేసుకున్నాడు. కాని ఆ కళ్లు, అవేచూపులతో ఇంకా తన్నే చూస్తుంటాయని తనకు తెలుసు.

"సోదరులారా!" ఒక కార్మికుడు మేఘఘాన్లో మాట్లాడుతున్నాడు తననిగురించే-పోలీసువాళ్లనిగురించి- "మా మీద తుపాకులు పేల్చకండి. మనం అంతా బీద వాళ్ళం. అందరం ధనవంతులకు ఊడిగంచేసుకొని బతుకు తున్నాం. ఒక్క సంగతి ఆలోచించండి. మేం యజమానుల్ని జీతాలు హెచ్చించమని అడుగుతున్నాం. ఇందులో మీకేమిసంబంధం? మీరూ మేమూ తగాదాలాడుకోవటం ఎందుకు? మీరు మమ్మల్ని చంపటం ఎందుకు ? మీరూ మాలాంటివాళ్ళే! మనం అందరం సోదరులం. మేము పేద వాళ్ల అందరి హక్కులకోసం పోరాడుతున్నాం మన విరోధులు మనలో మనకు చీలికలుపెట్టి, ఒకరిమీదకు ఒకరిని ఉసికొల్పి తాము సురక్షితంగా ఉంటున్నారు. నామాట వినండి. మన విరోధుల మాటలు నమ్మి మీ సోదరులను హత్య చెయ్యటానికి పూనుకోకండి" అన్నాడు

అతను చెప్పిందంతా నిజమే అనిపించింది తనకి. తనూ బీదవాడే. తన జీతం తనకి ఎప్పుడు చాలింది ! తనకు

ఎప్పుడూ డబ్బు ఇబ్బందే! డబ్బులేక ఎన్ని ఇబ్బందులు పడ్డాడు తను!

ఈ కార్మికులు మాత్రం ఏమడుగుతున్నారు? రెండు రూపాయలు ఎక్కువ అడుగుతున్నారు. వాళ్ళ కష్టాలు తనకు తెలుసు. రాత్రింబగళ్ళు కష్టపడతారు. ఇంటికి వొచ్చేటప్పటికి ధారకానికూడా ప్రాణం ఉండదు. వాళ్ళని తనెందుకు చంపాలి? తనకేం లాభం? వాళ్ళు తన్నేం చేశారు? వాళ్ళకు జీతాలు హెచ్చించక పోతే తనకేం లాభం? ధనవంతులకు లాభం. ధనవంతుల కోసం తనెందుకీ హత్యలు చెయ్యాలి? ఈ అమాయకపు కార్మికుల నెత్తురు తనెందుకు కార్చాలి?"

మంచంమీద కూర్చున్న పోలీసు రామయ్యకి ఇంట్లో వుండబుద్ధి పుట్టలేదు. ఒక్కసారి బయటకు వెళ్ళా లనిపించింది. కాని లేవలేకపోయాడు....

కార్మికులు ఏంచేస్తుంటారు? సమ్మె ఏమయిందో! పాపం తాను అకారణంగా చంపాడే .... వాళ్ళ వాళ్ళ భార్యలూ, భర్తలూ... వాళ్ళకి పసిపిల్లలుకూడా వుండి వుంటారు.

అతని తనలో "అమ్మా! అమ్మా" అనే ఏడుపులు వినిపించినై. భార్యలు .... భర్తలు ... తల్లులు... పసిపిల్లలు.... గుండెలు పగిలేటట్టు గీపెడుతున్నారు. ఆ మోత భరించ లేకపోయాడు పోలీసు రామయ్య. పట్టబలవంతాన మంచం మీదనుంచి లేచాడు.

"ఎక్కడికి" భార్య అడిగింది.

"ఇక్కడికే"—అన్నాడు పోలీసురామయ్య.

"అసలే ఓపికలేదు"—అన్నది భార్య.

"ఇప్పుడే వొస్తా"—అన్నాడు పోలీసురామయ్య.

"కూలివాళ్లు కోపంగా వున్నారు" అన్నది భార్య.

ఎందుకూ ? ఎవరిమీద? తనమీదేనా? ఉండదూ మరి! వాళ్లు చెప్తున్నా వినక సూపరింటెండెంటు ఆర్డరు ఇవ్వనే ఇచ్చాడని టపటప తుపాకీ పేల్చాడే! పదిమందిని తన పొట్టను పెట్టుకున్నాడే, కోపంగా ఉందంటే ఉండదూ మరి ? అయినా తనకేం భయం ? ఒకసారిచూచి....

పోలీసు రామయ్య నడవలేక తూలిపడ్డాడు. నెమ్మదిగా లేపి మళ్ళీ పడుకోబెట్టింది భార్య. ఢాం, ఢాం, ఢాం... మళ్ళీ తలలో తుపాకులు పేలిన మోత, కేకలు, ఏడ్పులు, బొబ్బలు, బిక్క మొహాలు, తిండిలేక పాలిపోయిన మొహాలు, రక్తంతో తడిసిన మొహాలు—ఒకదాని తర్వాత ఒకటి కనిపించినై.

ఒక కార్మిక స్త్రీ చంటిబిడ్డ నెత్తుకొని, "బిడ్డకి పాల్లేవు" అని ఏడుస్తూంది. ఒక ధనవంతుడు "రక్తం తాగించు" అంటున్నాడు.

ఒక కార్మికుడు "ఆకలి" అంటున్నాడు. ఒక ధనవంతుడు "దాహందాహం" అని కేకలు వేస్తున్నాడు.

ఒక కార్మికస్త్రీ "మనం అంతా కూటికి లేనివాళ్లమే

అన్నా, మమ్మల్ని చంపుతావా ?'' అంటూ వుంది. సూపరింటెండెంట్ "ఫైర్" అంటున్నాడు.

తను తుపాకి తీసుకొని ముందు నిలబడ్డాడు. కార్మికులు తనకు ఎదురుగా నిలబడ్డారు. ఎదురుగా నిలబడ్డ వాళ్ల మొహాలు చూస్తుంటే తన తండ్రి జ్ఞాపకం వొచ్చాడు. తన తండ్రి ఫ్యాక్టరీలో కూలివాడుగా పనిచేశాడు. కూలి చేసుకుంటూ కుటుంబాన్ని పోషించాడు. జీతం చాలక ఎన్ని బాధలు పడేవాడు; తన తల్లి యెందుకు మరణించింది. పేదరికం పేదరికమే: ఎవ్వరినైనా ఒకేవిధంగా పీల్చి పిప్పి చేస్తుంది.

మరి తనెందుకు చంపాలీ ఈ బీదవాళ్లని ? ఆకలి అవటం తప్పా; ఎవరికైతేమాత్రం ఆకలి తీరొద్దూ? యుద్ధం వొచ్చినాక లక్షలు లక్షలు గడించారే ఈ ఫ్యాక్టరీ యజమానులు. కూలివాళ్లకు ఒక రూపాయి ఎక్కువ చెయ్యమంటే ఎందుకు చెయ్యరు; సంపాదించేదేమో వాళ్లవల్ల ....డబ్బు ఇవ్వొచ్చేటప్పటికి పోలీసువాళ్లని పిలుస్తారు. తనకేంబట్టే ! తనెందుకు వొడిగట్టాలీ ఈ పాపానికీ ! తోటి బీదవాళ్లని తనెందుకు చంపాలి ?

"చంపను, చంపను" అంటూ మళ్లీ మంచంలో లేచి కూర్చున్నాడు రామయ్య.

"పడుకో" అని పడుకోబెట్టింది భార్య.

"వాళ్లు మావాళ్లే ! వాళ్లూ, నేనూ ఒకటే !"

"వైద్యుడు మాట్లాడవొద్దన్నాడు" అన్నది భార్య.

"బీదవాళ్లంతా ఒకటి" అన్నాడు పోలీసురామయ్య.

"ఏందుకోవూ !" ప్రార్థించింది భార్య.

"నేను చంపను — చంపను" అన్నాడు పోలీసు రామయ్య.

ఏమన్నా కానీ తాను బీదవాళ్లమీద తుపాకీ పేల్చడు. పేల్చకుండా అలాగే నిలబడ్డాడు. కార్మికులంతా తన చుట్టూ పోగవుతారు. వాళ్ల కళ్లు సంతోషంతో మెరిసి పోతుంటై. తనని కృతజ్ఞతతో కావలించుకుంటారు. అబ్బా.... వాళ్ల శరీరస్పర్శ ఎంత ఆనందాన్నిస్తుంది. ఎన్నడో మరణించిన తన తల్లి కావలించుకున్నట్టు వుంటుంది. అపును ఎందుకు వుండదు?

సూపరింటెండెంటుకు ఎంతకోపం వస్తుందని! ఆయనకి వొళ్లు మండిపోతుంది. తనని కోరచూపులు చూస్తాడు.

'పోలీసు రామయ్య కార్మికుల్లో కలిసిపోయాడు' అనుకుంటాడు. అనుకోనీ, అనుకుంటే తనకేం? తనమీదికే తుపాకీ గురిపెడుతున్నాడు సూపరింటెండెంటు. కాలుస్తున్నాడు. కాల్చుకోనీ, గుండు డొక్కలో దూరింది. దూరనీ... "అబ్బా" అని మూలిగాడు మంచంలో వున్న పోలీసు రామయ్య.

"నొప్పా?" అడిగింది భార్య.

"అయితే ఏం" అన్నాడు పోలీసు రామయ్య.

"ఎక్కడ?" అడిగింది భార్య.

పోలీసు రామయ్య జవాబు చెప్పలేదు. మాట్లాడకుండా పడుకున్నాడు.... ఢాం, ఢాం, ఢాం,... మళ్లీ తలలో తుపాకీ మోతలూ, కేకలూ, బొబ్బలూ, ఏడుపులూ, కార్మికుల దీనవదనాలు ఒకదాని తర్వాత ఒకటి కనిపిస్తున్నాయ్.

"అన్నా !"

"మనం అంతా బీదవాళ్లం."

"మనం అంతా ఒకటి"

"ధనవంతులపక్క జేరతావా?"

"నీకేమొస్తుంది?"

"చంపుతావా? మమ్మల్ని చంపుతావా అన్నా?"

"చంపను.... చంపను.... ఏమన్నా కానీ" అన్నాడు మంచంలోవున్న పోలీసు రామయ్య. అతని భార్య కన్నీరు మున్నీరుగా ఏడ్చింది.

డాక్టరొచ్చి పరీక్ష చేశాడు పోలీసురామయ్యని.

"ఎక్కడ నొప్పి ?" అడిగాడు.

"డొక్కలో" అన్నాడు రామయ్య.

డాక్టరు పరీక్షచేసి "ఏమీలేదు" అన్నాడు.

"అయితే గుండెల్లో" అన్నాడు పోలీసురామయ్య.

డాక్టరు పరీక్షచేసి "ఏమీలేదు" అన్నాడు.

"అయితే తల్లో" అన్నాడు పోలీసురామయ్య.

డాక్టరు పరీక్షచేసి, "అబ్బే! వూరికే భయపడుతున్నావు. నీకేజబ్బూ లేదు" అన్నాడు.

"లేకపోవటం ఏమిటి?" అన్నాడు పోలీసురామయ్య కోపంగా. డాక్టరు అతని మాటలు వినిపించుకోలేదు. వెళ్ళిపోతూ, "మనోవ్యాధి, అంతకంటే ఏమీ లేదు" అతని భార్యకు చెప్పాడు.

ధాం.... ధాం.. ధాం.... పోలీసు రామయ్య తలలో తుపాకులు పేలుతున్నాయి. కేకలూ, బొబ్బలూ, ఏడుపులూ, వినబడుతున్నయి. కార్మికుల దీనవదనాలు వరుసగా కనిపిస్తున్నయ్.

"అన్నా నన్నెందుకు చంపావు?"

"నేను నీకేం అపకారం చేశాను?"

"అంతా బీదవాళ్ళమే, మమ్మల్నా చంపాల్సింది?"

"రామయ్యన్నా ఇది నీకు ధర్మమా?"

"మేం అందరి బీదవాళ్ళకోసం పోరాడుతున్నాం?"

"రామయ్యన్నా మనం అంతా ఒకటి. మమ్మల్ని చంపకు"

"చంపను... చంపను" అని లేచి కూర్చున్నాడు పోలీసురామయ్య. "తప్పు క్షమించండి క్షమించండి.... ఏమన్నా కానీ చంపను... మీరూ, నేనూ ఒకటి... అంతా బీదవాళ్లం..." అన్నాడు పోలీసురామయ్య.

పోలీసురామయ్య హృదయం నెమ్మదించింది. ఇప్పుడతని తలలో తుపాకులు పేలటం లేదు. కేకలూ, బొబ్బలూ లేవు. "కార్మికుల ప్రాణాలు తీశాను. వాళ్లకోసం ప్రాణాలు అర్పిస్తాను" అనుకున్నాడు పోలీసురామయ్య...

—oo✽oo—

# గోడమీది మూడోవాడు

ఖాసింఖాను, శీతారామయ్యా బాల్య స్నేహితులు. వాళ్ల ఇల్లు ఒకదాని ప్రక్కన ఒకటియున్నా, ఆ ఇళ్లమధ్య గోడ వుంది. రాకపోకలు వీలుగా వుంటుందనే వుద్దేశంతో ఆ గోడ బద్దలు గొట్టించి, దారి పెట్టించుకున్నారు. ఈ పని వాళ్ల భార్యల వొత్తిడివల్ల జరిగింది.

పనిపాటలు త్వరగా పూర్తిచేసుకొని, వాళ్లిద్దరి భార్యలూ ఆ దారిలో కూర్చొని, కబుర్లు చెప్పుకుంటూ వుండేవారు. వాళ్లిద్దరికీ చాలా స్నేహం. ఒకరి కష్టసుఖాలు ఒకరు చెప్పుకుంటూ, రెండోవారివల్ల ఉపశాంతి పొందుతూ వుండేవాళ్లు. కూరలు వండటం, పిండివంటలు చెయ్యటం దగ్గర్నుంచీ ఒకరి సలహా ఒకరు తీసుకుంటూ వుండేవారు.

ఖాసింఖానుకి ఒక కొడుకూ, శీతారామయ్యకి ఒక కూతురు వుంది. వాళ్లిద్దరూ ఎప్పుడూ ఆ దారిలో కూర్చొని ఆడుకుంటూ వుండేవారు.

ఖాసింఖాను భార్యకి శీతారామయ్య కూతురంటే చాలా ముద్దు. ఎప్పుడూ తన యింట్లోనే ఉంచుకొనేది. ఆ పిల్ల ఒక్క క్షణం కనిపించకపోతే, "నాకోడలేదీ" అంటూ వెతుక్కుంటూ శీతారామయ్య ఇంటికి వొచ్చేది.

"నీ అత్త వొచ్చిందే!" అని పిలిచేది కూతుర్ని, శీతారామయ్య భార్య.

ఆ పిల్ల ఎక్కడున్నా, అత్త పేరు వినేటప్పటికి, విప్పారిన మొహంతో రెక్కలు కట్టుకొచ్చి వాలేది. ఆ పిల్లకి ఖాసింఖాన్ ఇంట్లోవుండే రొట్టెలూ, కేకులూ అంటే ఇష్టం. ఖాసింఖాన్ కొడుక్కి శీతారామయ్య ఇంట్లోదొరికే మీగడ పెరుగంటే ఇష్టం. ఒక్క పిల్లలకేకాదు; పెద్దవాళ్ళకుకూడా అంతే. అందుకని మధ్యదారిగుండా, వీళ్ళ రొట్టెలూ, కేకులూ వాళ్ళ ఇంటికీ, వాళ్ళ మీగడ పెరుగు వీళ్ళ యింటికీ ఎప్పుడూ రవాణా అవుతుండేవి. ఈ రెండు కుటుంబాలూ ఇంత అన్యోన్యంగా వుంటంవల్ల, ఒకరు మహమ్మదీయులూ. ఒకరు హిందువులూ అయినా వాళ్ళ ఆచార వ్యవహారాల్లో చాలా సామ్యత ఏర్పడింది. ఒకరి సాంప్రదాయాలు ఒకరు సానుభూతితో చూట్టం అలవడింది.

కాని రోజులు ఎప్పుడూ ఒక విధంగా గడవ్వు. భారతదేశంలో, ఇతరత్రా జరుగుతున్న మత కలహాలు నెమ్మదిగా ఆ గ్రామానిక్కూడా పాకినై. అంతకుముందు సోదరులకుమల్లే కలిసి మెలిసి వుంటున్న హిందువులూ, మహమ్మదీయులూ, ఒకరి నొకరు అనుమానించుకోవటం, అసహ్యించుకోవటం మొదలుపెట్టారు. ప్రజలు భయోతాత్పతులై, మతి భ్రమించినట్లు ప్రవర్తిస్తున్నారు.

మొదట్లో ఖాసింఖానూ, శీతారామయ్యా, మతకలహం తమ గ్రామం ప్రవేశించకుండా చెయ్యటానికి ప్రయత్నించారు గాని, వాళ్ళవల్ల అవలేదు. కన్నుమూసి కన్ను తెరిచేటప్పటికి మానవ స్వభావం, వాళ్ళ కళ్ళముందే

విచిత్రంగా మారిపోయింది. మానవుల్లో పశులక్షణాలు అగ్రస్థానం వహించిన్నై. అంతకిముందు తమ మాటను ఆజ్ఞగా శిరసావహించే వాళ్లు ఇప్పుడు తృణప్రాయంగా తోసివేస్తున్నారు. చెల్లాచెదురుగా హత్యలు జరుగుతున్నై. పొలంలో పనిచేసుకుంటున్న ఒక హిందువుని మహమ్మదీయులు పొడిచారు. కూలికి వెడుతున్న ఒక బీద మహమ్మదీయుని హిందువులు నరికారు. ఈ హత్యలతో ఊరంతా అట్టు వుడికినట్లు వుడికిపోయింది. ప్రాణమానాలకు రక్షణ అనేది లేకుండాపోయింది. ఈ సాకు తీసుకుని "శాంతి నెలకొల్పడం" అనే మిషతో, ఇంగ్లీషువాడు సైన్యసమేతంగా వొచ్చి, ఆ గ్రామంలో తిష్ఠ వేశాడు. తమలోతాము కలహించుకోవటంవల్ల, మూడోవాడొకడు ఆ గ్రామంలో అడుగుపెట్టడానికి వీలయింది.

వొచ్చీరాగానే ఇంగ్లీషువాడు, గ్రామంలోవున్న హిందువుల్నీ, మహమ్మదీయుల్ని పిలిపించి మాట్లాడాడు. మహమ్మదీయుల్తో ఏం మాట్లాడాడో హిందువులకు తెలియదు: హిందువులతో ఏం మాట్లాడాడో మహమ్మదీయులకు తెలియదు. కాని అతను మాట్లాడిన తర్వాత హిందువులూ, మహమ్మదీయులూ కూడా ఎవరికివారు, "ఇంగ్లీషువాడు మన పక్కే" అనే ధీమాతో విజృంభించారు.

ఈ విజృంభణ అప్పటివరకూ హిందూ, మహమ్మదీయ సఖ్యతకోసం ప్రయత్నిస్తున్న ఖాసింఖాన్నీ, శీతారామయ్యనీకూడా విడదీసింది. మహమ్మదీయులు విజృం

భించడానికి ఖాసింఖాన్ సహాయం వుందని శీతారామయ్యా, హిందువులు విజృభించడానికి శీతారామయ్య దోహదం లేకపోలేదని ఖాసింఖానూ ఊహించుకొని మనస్పర్ధలు పెంచుకొన్నారు.

ఇంగ్లీషువాడు ఇది కనిపెట్టి ఖాసింఖాన్ని, సీతారామయ్యనీ వేరువేరుగా పిలిపించి మాట్లాడాడు. సీతారామయ్యతో "ఖాసింఖాన్ని నీవు నమ్ముతున్నావు. అతను నీకు ద్రోహం చెయ్యాలని చూస్తున్నాడు. ఊరు మాటుమణిగింతర్వాత మీ ఇంటిమీదకు వొచ్చి పడదాం అని చూస్తున్నారు—జాగ్రత్త" అని శీతారామయ్యని హెచ్చరించాడు.

ఈమాట వినేటప్పటికి శీతారామయ్యకు చాలా కోపం వొచ్చింది. హృదయం ఉడికిపోయింది. ఖాసింఖాన్ చర్యలు ఇటీవల అనుమానాస్పదంగావున్నా- తనకే ద్రోహం చెయ్యటానికి పూనుకుంటాడని అతడెప్పుడూ అనుకోలేదు. నిజంగా మహమ్మదీయుల్ని నమ్మగూడదు అనుకున్నాడు. తగుమాత్రం జాగ్రత్తలో వుండాలని నిశ్చయించుకున్నాడు. ఇంటికి వెళ్ళీ వెళ్ళటంతోనే తాపీవాళ్ళని పిలిపించి ఖాసింఖాన్ ఇంటికీ తన ఇంటికీ మధ్యవున్న దారి పూడ్పించి వేశాడు. ఈ సంగతి ఇంగ్లీషువాడు తెలుసుకొని ఖాసింఖాన్ని పిలిపించి "నువ్వు వొట్టి అమాయకుడివి. కాకపోతే శీతారామయ్యతో నీకు ఎట్లా పొత్తు కుదురుతుంది? నీ వాసనే తగలకూడదని, మీ ఇళ్ళమధ్య గోడ కట్టించాడటగా" అన్నాడు.

ఈ మాటలకు ఖాసింఖాన్ ఉగ్రుడైపోయాడు. తను ఎంతో సోదర భావంతో ఉంటున్నాడే: దానికి ప్రతిఫలం ఇదా! ఈ హిందువులను నమ్మకూడదు, తన జాగ్రత్తలో తానుండాలి అనుకున్నాడు. ఇంటికి వెళ్లీ వెళ్లడంతోనే, తాపీ పనివాళ్లను పిలిపించి శీతారామయ్య కట్టించిన గోడకు సిమెంటు పూత వేయించాడు.

అప్పటినుంచీ ఈ ఇంట్లో కేకులు ఆ యింట్లోకీ, ఆ యింట్లో మీగడ ఈ ఇంట్లోకి వెళ్లటంలేదు. వాళ్ల కేకులు వాళ్లే తినేవారు; వీళ్ల మీగడ పెరుగు వీళ్లే తినేవారు.

"ప్రాణానికి హాయిగావుంది. ఏచీకూ చింతాలేకుండా ఎవరిబ్రతుకువాళ్ళమేబ్రతుకుచున్నాం" అనుకున్నారుఇద్దరూ

కాని కొన్ని రోజులు గడిచేటప్పటికి ఈ బ్రతుకు దుర్భరం అనిపించింది. ఇద్దరి భార్యలూ ఏపనిచెయ్యకుండా ఏదో పోగొట్టుకున్న వాళ్లమల్లే అస్తమానం దిగులుగా కూర్చునేవాళ్లు. పిల్లలకు ఒకచోట కాలు నిలిచేదికాదు. దేనికోసమో వెతుక్కుంటున్నట్లు ఇల్లంతా తిరుగుతుండే వాళ్లు బిక్క మొహాలు పెట్టుకుని.

వీటన్నిటికంటె మరొక్కటి పెద్దబాధ అయిపోయింది అవతల ఏం జరుగుతూవుందో ఇవతలవాళ్లకు తెలియదు! ఇవతల ఏం జరుగుతూవుందీ అవతలవాళ్లకి తెలియదు. అవతల వాళ్లు తనమీద ఏవో కుట్రలు పన్నుతూవుంటారని ఎవరికివాళ్లు అనుమానపడటం మొదలుపెట్టారు. ఏక్షణం వొచ్చి అవతలవాళ్లు మీదపడతారో అని ఎవ్వరికి వాళ్లు

కళ్లల్లో వొత్తులు పెట్టుకొని కాపలా కూర్చునేవారు. ఈ అనుమానం కలిగినప్పటినుంచీ ఖాసింఖాన్‌కిగానీ, శీతారామయ్యకుగానీ సరిగా నిద్రలేదు, తిండిలేదు, మనస్సుకి శాంతిలేదు.

ఈ బాధ భరించలేక ఒకరికి తెలియకుండా ఒకరు వెళ్ళి ఇంగ్లీషువాడి సహాయం కోరారు.

"ఖాసింఖాన్ సంగతి తమకు తెలుసు తమరి సహాయం లేకపోతే మేం బ్రతకలేం అన్నాడు" శీతారామయ్య.

"నేను ఉండగా నీకేం పరవాలేదు" అన్నాడు ఇంగ్లీషువాడు.

శీతారామయ్య వెళ్ళిపోగానే ఖాసింఖాన్ వొచ్చాడు.

"శీతారామయ్య సంగతి మీకు తెలుసు.

ఈ సందర్భంలో మీ రక్షణ అవసరం" అన్నాడు ఖాసింఖాను.

"నాకన్నీ తెలుసు, నేను వుండగా, నీకేమీ పరవాలేదు అన్నాడు ఇంగ్లీషువాడు.

తెల్లవారేటప్పటికి తుపాకీ భుజాన పెట్టుకొని శీతారామయ్య ఖాసింఖాన్‌ల ఇళ్ళమధ్య వున్న గోడమీద నిలబడి కాపలా కాస్తున్నాడు ఇంగ్లీషువాడు.

ఆ ఇంగ్లీషువాణ్ని చూచి. "ఖాసింఖాన్ రోగం కుదిర్చాను" అనుకున్నాడు శీతారామయ్య. "శీతారామయ్య రోగం కుదిర్చాను" అనుకున్నాడు ఖాసింఖాన్. ఎవరికి వాళ్ళు ఇంగ్లీషువాడు తన రక్షణార్థమే వొచ్చాడనుకున్నారు సంతోషించారు.

ఇంగ్లీషువాడు అస్తమానం ఆ గోడమీదే తుపాకి భుజాన పెట్టుకొని నుంచొని కాపలా కాస్తుండేవాడు. ఒకప్పుడు తుపాకి ఖాసింఖాన్ ఇంటివైపు గురిపెట్టేవాడు— అప్పుడు శీతారామయ్య సంతోషించేవాడు. ఒకప్పుడు శీతారామయ్య ఇంటిమీదకు తుపాకీ గురిపెట్టేవాడు–అప్పుడు ఖాసింఖాన్ సంతోషించేవాడు.

తన కర్తవ్యం ఈవిధంగా నిర్వర్తిస్తూ ఒక రోజు అతను, "నేను ఇరవైనాలుగు గంటలూ మీ పనిలోనే చేరి వుంటున్నాను. నాకు ఎండ తగలకుండా నా నెత్తిమీద గొడుగు కట్టించవలసిన బాధ్యత మీ మీద వుంది" అని చెప్పాడు. ఈ కోర్కె ఖాసింఖానుకీ, శీతారామయ్యకీ న్యాయంగానే తోచింది. నేను కట్టిస్తానంటే నేను కట్టిస్తానని పోటీపడి ఋణంమీద ఇంగ్లీషువాడికి తగలకుండా గొడుగు కట్టించారు.

"నేను మీ పనిలో వుంటున్నాను గనక నాకు భోజన సదుపాయాలు మీరే చెయ్యాలి" అన్నాడు గోడమీద ఇంగ్లీషువాడు. ఈ కోర్కె కూడా వాళ్ళకి న్యాయంగానే కనిపించింది. ఆ రోజు మొదలు ఖాసింఖాను ఇంట్లోవున్న కేకులూ, శీతారామయ్య ఇంట్లోవున్న మీగడపెరుగూ గోడమీదవున్న ఇంగ్లీషువాడే తినేసేవాడు.

ఆంతటితో తృప్తిపడితే అదొక రకంగా వుండేదేమో కాని ఇంగ్లీషువాడికి తృప్తి అనేది లేదు వాళ్ళ కుటుంబ వ్యవహారాల్లోకూడా జోక్యం కలుగజేసుకోవటం మొదలు

పెట్టాడు. "మీ భార్యలు వెనకపక్కనే వుండాలి." "నాకు గాలి రావటానికి ఈ గోడలు పడగొట్టాలి" "మీరు దొడ్డిదారినే నడవాలి" "మీరు నాకు యిష్టమైన కూరలే తినాలి." "నాకు ఇష్టమైన అన్నమే వండాలి" నాకు ఇష్టమైన దుస్తులే ధరించాలి."

ఇవన్నీ భరించారు ఖాసింఖాను, శీతారామయ్యా. అతను తమకు రక్షణ యిస్తున్నాడు. అహోరాత్రులు తమ కోసం కష్టపడుతున్నాడు. ఏవో కొన్ని ఇబ్బందులు సహించకపోతే ఎట్లా? అనుకున్నారు.

కాని ఒక విషయంమాత్రం వాళ్ళు భరించలేక పోయారు. గోడమీద వున్న ఇంగ్లీషువాడి మెప్పు పొందాలని,మంచిమంచి భోజనపదార్ధాలన్నీ అతనికి పెడుతు న్నారు. కేకులూ, మీగడ పెరుగూ అతనికే పెడుతు న్నారు. పిల్లలు ఆశాపాత్రంగా చూస్తూవున్నా వాళ్ళని గూడా లెక్కచేయకుండా తాము అర్ధాకలితో వుంటూ అంతా ఇంగ్లీషువాడికి ముట్టజెపుతున్నారు. అతను కేకు ముక్కపెట్టీ, మీగడ రుచి చూపించీ మాయజేసి తమ పిల్ల లను తమకు కాకుండా చెయ్యటానికి ప్రయత్నిస్తున్నాడు.

పిల్లలను దగ్గరకు తీసి యిలా చెప్పేవాడు,

"మీ తండ్రులు అసమర్ధులు"

"మీకు చిరుతిండి పెట్టరు"

"మమ్మల్ని నమ్ముకుంటే..."

ఖాసింఖాను ఎన్నయినా ఓర్చాడుగాని తన పిల్ల

వాని మనస్సులోకి విషం ఎక్కుతుంటే చూచి ఓర్చలేక పోయాడు. ఈ బ్రతుకు బ్రతికిందానికంటే మరణించటమే మేలు అనుకున్నాడు. తను ఏమైనా ఇబ్బందిలేదు. కాని తన కొడుకు పాడవటం మాత్రం సహించగూడదు అనుకున్నాడు. ఈ ఇంగ్లీషువాడిచ్చే రక్షణకంటే మరణమే మేలు.

ఆ రాత్రి అందరినీ పడుకోనిచ్చి, తాను లేచాడు. గడ్డపలుగు తీసుకొని గోడదగ్గరకు వెళ్ళాడు. ఇంగ్లీషువాడు తుపాకి భుజాన పెట్టుకొని గోడమీద నుంచొని వున్నాడు. కాని ఖాసింఖాన్ని చూడలేదు. ఖాసింఖాన్ కళ్ళు మూసుకొని ఆ గోడని పలుగుతో ముక్కలు ముక్కలుగా బ్రద్దలు కొట్టాడు. గోడమీదవున్న ఇంగ్లీషువాడు గోడతోపాటు గభాలున కూలబడ్డాడు.

గోడకు మామూలుదారి ఏర్పడింది. అవతలప్రక్క మరొక పలుగు చేత్తో పట్టుకొని నిలబడి వున్నాడు శీతారామయ్య. అతనూ గోడ పగలగొట్టే ప్రయత్నంలోనే వున్నాడని గ్రహించాడు ఖాసింఖాన్.

ఇద్దరూ అప్రయత్నంగా ఒకరినొకరు కౌగలించుకొని ఆనందాశ్రువులు రాల్చారు. కాళ్లదగ్గర ఇంగ్లీషువాడు పడివున్నాడు. లేచే స్థితిలో లేడు. అప్పుడు వాళ్ళకి తెలిసింది—తామిద్దరూ కలిస్తే ఇంగ్లీషువాడిదేమీ లేదనీ, కలవనంతకాలం అంతా ఇంగ్లీషువాడిదనీ!

---

# గోపీచంద్ కథలు

గోపీచంద్ కథల్లోని వస్తు వెప్పుడూ ప్రగతిశీలంగా వర్తమాన, సాంఘిక, ఆర్థికవ్యవస్థలలోని మురికి కూపాల్ని బహిరంగపరిచేదిగా వుంటుంది. ఇందుక్కారణం ఆయన విప్లవాత్మక మైన భావసంపద, హేతుబద్ధమైన శాస్త్రీయ విజ్ఞానం. ప్రతి కథలోనూ మూఢాచారాలు, హేతువాదానికి దూర మైన విషయాలు, ఆయన వ్యంగ్యం తాకిడికి నుసి అయిపోతాయి.

పాత్రపోషణలో సునిశితమైన, సూక్ష్మమైన మనస్తత్వశాస్త్ర పారీణత చూపెడతాడు. ప్రతికథా మనలో జిజ్ఞాస, చైతన్యం కలిగిస్తుందంటే అందుకు వస్తువు కారణం.

"కళకోసం కళ" అనే వాదాన్ని అంగీకరించడు. "కళకు ప్రయోజనం వుండాలనీ, ఆ ప్రయోజనం సంఘానికే శ్రేయస్సు కూర్చేదిగా వుండాలనీ, రచయిత రచనావిశేషం ఆ ప్రయోజనాన్ని సాధించటానికి వుపయోగపడాలనీ". "సంఘంలో జరిగే సంఘటనకు ప్రయోజనం కలిపి రచయిత చదువరులకు సక్రమమైన దృష్టి కలిగించాలి". అనీ ఆయన సిద్ధాంతం.

WRAPPER
PRINTED AT
VIJAYA PRESS
VIJAYAWADA

రూ. 1-50

చదవండి!